Uppunuthala Katha - a local traditional history in Telugu of a Village, Uppunuthala, Mahboobnagar Dt. Written by Kapilavayi Lingamurthi.

---

ప్రథమ ముద్రణ : మే 1988
ప్రతులు : 1000
వెల : 8-00

ప్రతులకు :
కె. జనార్దనరెడ్డిగారు
దేవస్థాన కమిటీ అధ్యక్షులు
ఉప్పునూతల - 509 376
అచ్చంపేట తాలూకా.

కె. కిశోరుబాబు
15-34 వాణీ సదనం
నాగర్ కర్నూలు - 509 209

ముఖపత్ర రచన :
శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాద్-500 001.



కర్త

కపిలవాయి లింగమూర్తి



కారయిత

డా॥ వి. బాలనారాయణగారు

M.B.B.S.

# నా మాట

ఇది ఒక స్థలచరిత్ర. దీన్ని నేను వ్రాయటానికి ఇదే గ్రామంలో ఉండే డాక్టరు శ్రీ బందం బాలనారాయణగారు కారకుడు. అతడు తమ గ్రామంలో ఉండే కేదారేశ్వర స్వామి భక్తుడు. ఆ స్వామి అనుగ్రహంతో తన వృత్తిలో రాణించి పిల్లా పాపలతో కాపురం చేసుకుంటున్న ఆదర్శ గృహస్థు. ఆర్య శిఖామణి. అతనికి తమ గ్రామాన్ని గురించి, అక్కడ ఉండే ఆలయాన్ని గురించి ఒక చరిత్ర వ్రాయించవలెననే సంకల్పం కలిగింది.

ఉప్పునూతలలో నివసించిన ఈ వంశీయులు సచ్చింతనాపరులుగా ధర్మశీలురుగా కనిపిస్తారు. అక్కడి వీరి వంశానికి మూలపురుషుడు కాశన్న. అతని కుమారుడు పరంధామయ్య. పరంధామయ్య కుమారుడు మల్లయ్యకు జ్యోతిష్యంలోను, వైద్యంలోను మంచి ప్రవేశం ఉండేది. మల్లయ్యకు పరంధామయ్య, బాలయ్య అనే కుమారులు కలిగినారు. ఈ పరంధామయ్య పురాణవిజ్ఞుడై ఉండేవాడు. బాలయ్యగారి సతీమణి మాణిక్యమ్మగారు. ఆ దంపతులకు బాల లక్ష్మయ్య, బాల నారాయణ, మల్లికార్జునుడు అనే ముగ్గురు కుమారులు కలిగినారు. బాల లక్ష్మయ్య ప్రస్తుతం అసిస్టెంటు యింజనీరుగా, బాల నారాయణ డాక్టరుగా ఉద్యోగాలలో ఉండగా, మల్లికార్జునుడు వ్యాపారంలో ఉన్నాడు. ఈ సోదరులలో రెండవ వాడైన బాల నారాయణ గారే ఈ కథా ప్రేరకుడు.

లోకంలో సత్సంకల్పంగాని సత్కార్యాచరణ బుద్ధిగాని అందరికీ కలుగదు. దానికి ప్రాక్తన పుణ్యవిశేషం అవసరం. బాలనారాయణ గారి సంకల్పం తెలిసి నేనతని దగ్గరకు వెళ్ళినాను.

ఉప్పునూతల అచ్చంపేట తాలూకాలోని గ్రామం. నా జన్మ గ్రామం జినుకుంట, మాతామహ గ్రామం అమరాబాదు ఆ తాలూకా లోనివే. ఆ తాలూకాలో ప్రాచీన గ్రామాలు, ప్రాచీనాలయాలు చాలా ఉన్నవి. ఉమామహేశ్వరం, మామిళ్ళపల్లి వంటి మహాక్షేత్రాలున్నవి.

కనుక వానిని పరిశీలించిన పిమ్మట నాకు మా తాలూకా చరిత్ర వ్రాయా లని కోరిక కలిగింది. తోచినట్లల్లా విషయ సేకరణ మారంభించాను. అలా ఉండగా దైవికంగా మామిళ్ళపల్లి దేవస్థానం చైర్మన్ శ్రీ ఎం. రంగారావుగారు నన్ను తమ క్షేత్రచరిత్ర వ్రాసి యివ్వవలసిందిగా కోరి నారు. దానితో నా చరిత్ర రచనకు శ్రీకారం చుట్టినట్లయింది. ఆ పిమ్మట మా తల్లిగారి కోరికపై "శ్రీ మత్ప్రతాపగిరి ఖండం" అనే పేర అమరా బాదు వీరభూమి చరిత్ర ఒక కావ్యంగా కూర్చినాను. ఆ కోవలో ఇది మూడవది. దీన్ని నేను ఒక్క ఉప్పునూతల చరిత్రేగానే గాక, అమరా బాదు పీఠభూమి తప్ప మిగతా అచ్చంపేట తాలూకా కంతటికి ఒక సాధా రణ చరిత్రగా ఉండేటట్లు యత్నించినాను.

డా॥ బాలనారాయణగారు నేను ఒకే తాలూకావారము. అంతేగాక అతనికి కలిగిన సంకల్పం నా కోరికకు సరిపోవటం మరో విశేషం. కాని, గ్రంథ రచన, అంతకుమించి ప్రచురణ అందరికీ లాభసాటి పనిగాదు. ఆయన సాధక బాధకాలు విని రచన మీది, ప్రచురణ నాది. వాని నిర్వ హణా భారమంతా ఆ స్వామిది అన్నాడు. నేను రచన మారంభించాను.

కవి తా నెన్నుకొన్న కథను వచనంలో పేరాలు పేరాలుగా చెప్ప వచ్చు. పద్య గద్యాలలో ప్రబంధంగా తీర్చవచ్చు. లేదా పాత్రలను సృజించి వారి సంభాషణ మరియు సందేహ సమాధానాల రూపంలో రూపక పద్ధతిలో చెప్పవచ్చు. వానిలో పద్ధతి ఏదైనా ఎత్తుకున్న కథకు న్యాయం చేకూర్చటం ముఖ్యం. నేను దీన్ని పైన చెప్పిన మూడవ పద్ధతిలో రచించాను.

చరిత్ర రచనలో రెండు పద్ధతులున్నవి. ఒకటి శాసనాలు, కైఫియత్తులు, కవిలెలు పరిశీలించి సేకరించటం; రెండవది స్థానిక వృద్ధుల నోటవిన్న విషయాలు వడకట్టడం. దీనిలో నేను రెండు పద్ధతులు స్వీక రించినాను. విద్యావంతులు గాకపోయినప్పటికి స్థానిక వృద్ధు లనుశ్రుతంగా

చెప్పుకునే కథల వెనుక కొంతైనా సత్యముండకపోదు. "పాము"నే మాట వినక పడగ అనే మాట పుట్టదు కాబట్టి నేను జానపదుల నోటవిన్న అచ్చంపేట ముచ్చట, జోగిరెడ్డి జోలి, ఉప్పునూతల ఊరిసంగతి యథాతథంగా జానపదుల భాషలోనే చెప్పటానికి యత్నించినాను. నాకీవిషయంలో విషయ సంగ్రహణం చేసి తోడ్పడినవాడు రాకొండ నివాసి ఎం. శేఖరరెడ్డి. అతడు నాకభిమాన ఛాత్రుడేగాక నా కృషికి ఏదో విధంగా సహాయ పడుతుంటాడు జిల్లాలో ఆదర్శోపాధ్యాయునిగా బహుమతి గూడ అందుకున్నాడు.

ఈ పుస్తకానికి కోరినంతనే ఆదరంతో పీఠికలు వ్రాసి యిచ్చిన శ్రీ తిరుమల రామచంద్రగారికి మరియు శిల్పకళాచార్యులు శ్రీ పెదపాటి నాగేశ్వరరావుగారికి ఇందుమూలముగా కృతజ్ఞతలు తెలుపుచున్నాను. ముద్రణావ్యవహారాలలో, విషయ సేకరణలో చేదోడు వాదోడుగా నుంటున్న మా చిరంజీవులు కిశోరుబాబు, అశోకుబాబులకు ఆశీర్వాదాలంద జేస్తున్నాను.

ఈ కథలో ప్రధాన పాత్ర పరంధామయ్యగారు. నే నెన్నుకున్న ఈ పేరువారే కృతికారక వంశంలో యిద్దరున్నారు. అదొక యాదృచ్ఛిక విశేషం. ఆతడు గౌరి, కేశవుడనే మనుమలకు వారు వేసే వివిధ ప్రశ్నలకు సమాధానంగా ఈ కథను చెబుతాడు. స్థలచరిత్రలో ఇదొక నూతన పద్ధతిగా నేననుకుంటున్నాను. కనుక వారితోపాటు మీరూ చేరి ఈ కథా విశేషాన్ని తెలుసుకొని నే నెంతవరకు నా ప్రయత్నంలో కృతకృత్యుడనైనానో నిర్ణయించండి.

తేది. 28-5-88 ఇట్లు

15-84, వాణీసదనం మీ

[illegible] [illegible]

చెప్పుకునే కథల వెనుక కొంతైనా సత్యముండకపోదు. "పాము"నే మాట వినక పడగ అనే మాట పుట్టదు కాబట్టి నేను జానపదుల నోటవిన్న అచ్చం పేట ముచ్చట, జోగిరెడ్డి జోలి, ఉప్పునూతల ఊరిసంగతి యథాతథంగా జానపదుల భాషలోనే చెప్పటానికి యత్నించినాను. నాకీవిషయంలో విషయ సంగ్రహణం చేసి తోడ్పడినవాడు రాకొండ నివాసి ఎం. శేఖర రెడ్డి. అతడు నాకభిమాన ఛాత్రుడేగాక నా కృషికి ఏదో విధంగా సహాయ పడుతుంటాడు జిల్లాలో ఆదర్శోపాధ్యాయునిగా బహుమతి గూడ అందు కున్నాడు.

ఈ పుస్తకానికి కోరినంతనే ఆదరంతో పీఠికలు వ్రాసి యిచ్చిన శ్రీ తిరుమల రామచంద్రగారికి మరియు శిల్పకళాచార్యులు శ్రీ పెదపాటి నాగేశ్వరరావుగారికి ఇందుమూలముగా కృతజ్ఞతలు తెలుపుచున్నాను. ముద్రణావ్యవహారాలలో, విషయ సేకరణలో చేదోడు వాదోడుగా నుంటున్న మా చిరంజీవులు కిశోరుబాబు, అశోకుబాబులకు ఆశీర్వాదాలంద జేస్తున్నాను.

ఈ కథలో ప్రధాన పాత్ర పరంధామయ్యగారు. నే నెన్నుకున్న ఈ పేరువారే కృతికారక వంశంలో యిద్దరున్నారు. అదొక యాదృచ్ఛిక విశేషం. అతడు గౌరి, కేశవుడనే మనుమలకు వారు వేసే వివిధ ప్రశ్నలకు సమాధానంగా ఈ కథను చెబుతాడు. స్థలచరిత్రలో ఇదొక నూతన పద్ధతిగా నేననుకుంటున్నాను. కనుక వారితోపాటు మీరూచేరి ఈ కథా విశేషాన్ని తెలుసుకొని నే నెంతవరకు నా ప్రయత్నంలో కృతకృత్యుడ నైనానో నిర్ణయించండి.

తేది. 28-5-88 ఇట్లు

15-84, వాణీసదనం మీ

నాగర్ కర్నూల్ కపిలవాయి లింగమూర్తి

# మనవి మాటలు

కథ చెప్పడం ఒక కళ. ''అనగనగా ఒక రాజు'' అనో, ''అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా'' అనో, ''లక్ష్మణస్వామి నవ్వాడు'' అనో, ''పరంధామయ్య పెన్షన్ పుచ్చుకొని ఇంటికి వచ్చాడు,' అనో, ఏ విధంగా కథ ప్రారంభించినా, పాఠకుల శ్రోతల ఆసక్తిని, కుతూహలాన్ని అవిచ్ఛిన్నంగా కొనసాగింపజేయడం కథకునికి కావలసిన కైవాడం. అందులోను పిల్లలకు కథలు చెప్పేవారికి ఈ కైవాడం మరింత హెచ్చుగానే ఉండాలి. పిల్లలు కుతూహలపు పుట్టలు. అంతా వారికి ఆశ్చర్యమే. ఉన్నట్టుండి ఏదో ప్రశ్న వేస్తారు. దానికి జవాబు వెంటనే తోచదు కథకునికి. పిల్లల దృష్టిలో పడిపోరాదు, ఏం చేయడమా అని విలవిలలాడిపోతాడు. వారి దృష్టి మరల్చడానికి ప్రయత్నిస్తాడు గడుసువాడైతే. ఒకప్పుడు ఆ గడుసుతనం కూడ పిల్లల చూపులో తేలిపోతుంది. అలాంటప్పుడు జవాబులు దాటవేయడం తప్పనిసరి. పిల్లలు పెద్దలకు ఒక రకంగా పంతులు. వారి ప్రశ్నలు అమాయకంగా కనిపిస్తాయి. కాని, వాటిలో వారి జిజ్ఞాసాకుతూహలాలన్నీ పొంగి పొర్లుతుంటాయి. వారిని సంతృప్తి పరచడానికే పెద్దపెద్ద వైజ్ఞానికులు వారి స్థాయికి దిగి కథలుగా చెప్పారు గహనతర విషయాలను. అది ఆయా రంగాలలో ఆరితేరిన వారికే సాధ్యమవుతుంది. విషయం క్షుణ్ణంగా తెలిసినా చాలదు. కథాకథనరీతి తెలియాలి. అందుకే అదొక కళ అన్నాను.

ఆ కళను చక్కగా కైవసం చేసుకొన్నవారు మిత్రులు శ్రీ లింగమూర్తి. 'ఉప్పునూతల కథ' చెప్పదలచుకున్నారు. దానికి అవసరమైన చారిత్రకాంశాలు సేకరించారు. పిల్లలు ఏ ఏ దృక్కోణాలతో ప్రశ్నించవచ్చుననుకున్నారో, ఆ దృక్కోణాలతో సమాధానాలు నిర్ణయించుకొన్నారు. ఆసక్తిని ఇనుమడింప జేసే శైలితో కథ కొనసాగించారు;

తమ లక్ష్యాన్ని సాధించారు. కనుకనే పిల్లలకేకాక పెద్దలకూ ఈ 'ఉప్పు నూతల' కథ వినోదాన్ని, విజ్ఞానాన్ని కలిగిస్తున్నది.

కథాకథనానికి భాష ముఖ్యమైన సాధనం. ఈ సాధనం అవుడయితే కథకుని లక్ష్యం దెబ్బ తింటుంది. భాష శ్రోతృపాఠకుల స్థాయికి అనుగుణంగా ఉండాలి. ఈ కిటుకును గ్రహించిన లింగమూర్తిగారు సరళ శిష్ట వ్యవహార భాషను వాడడం కథాకథనానికి వన్నె పెట్టింది. 'భాష పన్నెండామడకు మారుతుంటుంది' అని పంజాబీ సామెత. ఈ సామెత అన్ని భాషలకు వర్తిస్తుంది. సామాన్య వ్యవహారం, మాండలికాలు కలిసే భాష అవుతుంది. మాండలికాల మాధుర్యం పోతే ఏ వ్యవహార భాష అయినా రసం పోయిన చెరకు పిప్పి అవుతుంది. లింగమూర్తిగారు ఆయా సందర్భాలలో చక్కని మాండలికాలు, నుడికారాలు వాడి, కథకు కమనీయతను చేకూర్చారు. ఉదాహరణకు:- పెత్తరమాస (మహాలయామావాస్య), ముంజాత (ముందుగానే), ఉరుము (జాతర), కాడుబడి (దిక్కుతోచక చిక్కుబడి), స్తాంబాళం (పళ్ళెం), దినయుక్తం (మంచి దినం, యుక్తమైన దినం), వ్రతం పట్టి తామని, కలియగాయ (కలగూర), ఆసాదించు (అమర్చు), ఎనుపతేలు (మంత్రగబ్బ)— ఇలాటివి ఎన్నైనా చూపవచ్చు.

కథాకథనంలో లింగమూర్తిగారు పెక్కు సంప్రదాయాలను, చరిత్రాంశాలను ప్రసంగవశాత్తు చెప్పారు. వాటికి ఆకరాలను, ప్రమాణాలను పిల్లలకు అనువుగా వివరించారు.

ఒకటి రెండు విషయాలలో నేను ఏకీభవించలేకపోతున్నందుకు విచారపడుతున్నాను. కొటారులనుంచి ఉప్పు తేవటంలో పూర్వం లంబాడీలు ఘటికులు, వారు మహారాష్ట్రులు (పుట 36). లంబాడీలు మహారాష్ట్రులు

కారనుకుంటాను. వారి భాష నేటి మహారాష్ట్ర, రాజస్థానీ (మార్వాడీ), గుజరాతీల పూర్వరూపమైన భాషా స్వరూపం. 2. అది (నోము) నియమం అనే దానియొక్క రూపం (పుట 96). నోము తమిళంలో నోంబు. నియమ శబ్దం నుంచి పుట్టింది కాదనుకుంటాను. వ్యుత్పత్తిని గురించి పరిశీలించాలి. 3. పదకొండవ శతాబ్దంలో కన్నడ దేశంలో బసవేశ్వరుడు అనే ప్రవక్త ఒకాయన పుట్టి శైవమతంలో వీరశైవం అనే ఒక శాఖను పైకితెచ్చినారు. ఆయనకు చాలమంది శిష్యులున్నారు. వారిలో పండితారాధ్యు డొకడు (పుట 108). పండితారాధ్యుడు బసవేశ్వరుని శిష్యుడు కాడు. బసవుని దర్శిద్దామని బయలుదేరి మార్గమధ్యలో మరణిస్తాడు పండితారాధ్యుడు. బ్రాహ్మణత్వాన్ని, శివభక్తిని వదలుకోలేనని (బాసు లేను నేను బసవలింగ) బసవేశ్వరునికి పండితారాధ్యుడు సందేశం పంపి నట్టు ఐతిహ్యం.

ఏమైనా, ఉప్పునూతల కథ చక్కగా చెప్పిన కథ. తెలుగువారి పండుగలు, వ్రతాలు, సంప్రదాయాలు, చరిత్రాంశాలు ప్రసక్తాను ప్రసక్తంగా పోషించిన చక్కని కథామాల. లింగమూర్తి గారిని అభినందిస్తున్నాను.

రుధిరోద్గారి జ్యేష్ఠ పూర్ణిమ
(25–6–1983)
ఆదర్శనగర్, హైదరాబాద్

భాషా సేవకుడు
తిరుమల రామచంద్ర

# చవులూరించు

# ఉప్పునూతల కథ

## ఒక పరిచయం

కథలు వినడానికీ చదవడానికీ ఆహ్లాదకరంగా ఉంటై. వీటికోసం పసివారి నుండి వృద్ధుల వరకూ అర్రులు చాచుకొని చూడటం అలవాటు. అన్ని వాఙ్మయాలలోనూ ఈ కథాప్రక్రియ విజయ విజృంభణం చేయడం అందరికీ విదితమే. ఈ కథలలో చాలవరకు కల్పన మీద ఆధారపడినవే ఉండటం సహజం. కాని రచయిత యొక్క పరిణతిని బట్టి వాటి యొక్క వైశిష్ట్యం ఉంటుందనడం సర్వజన విదితం.

కొన్ని రోజుల క్రితం కవిగారూ నేనూ కలిసినపుడు కేదారేశ్వర దేవాలయాన్ని గూర్చి ప్రసంగం రావడమూ, నేను కర్ణాటక విశ్వవిద్యాలయంలో డా॥ శెట్టారుని కృషిని, జక్కణాచార్యుని శిల్పాల్నీ ముచ్చటించటం జరిగింది. అది జరిగిన కొలదిరోజులకే ఈ గ్రంథం నా చేతికి వచ్చి పీఠిక కొరకు నిలవడం ఆశ్చర్యమనిపించింది. ఈ కథాగ్రంథం ఒక్కపట్టున చదివించింది. యావత్ మహబూబ్‌నగర్ మండల చరిత్రనూ కేదారయాత్రనూ హృదయంగమంగా వర్ణించడమూ, రసవంతమైన రీతిలో ఎన్నో విషయాల్ని గుప్పించడమూ జరిగింది.

కేదారేశు భజించితిన్ శిరమునన్ గీలించితిన్ హింగుళా పాదాంభోరుహముల్ — అన్న పెద్దన్నగారి పద్యంతో తెలుగువారు కేదారేశుని విన్నారు. నేడీ కథల ద్వారా ఆ యాత్రాపద్ధతిని కూడా సమగ్రంగా తెలిసికొన్నవారైనారు.

కావ్యాల్లో గ్రంథమాహాత్మ్యం, ఫలశ్రుతి లాంటి నియత రచన లుంటై. వాటి అర్థాలు వ్యాఖ్యానాలవల్ల తెలియవలసి ఉంటుంది. ఈ రచయిత వానికిగూడ కథలరూపంలోనే సారార్థం తెలియబఱచి రచయితల - గోడు వినిపించినాడు. ఈ సంపుటి ద్వారా కవిగారి చారిత్రక కృషి ప్రజా దరణపాత్రమైన కథాప్రక్రియలో నాలుగు కాలాలపాటు నిలిచే రీతిలో పుష్పించినదనవచ్చును. ఇందులో వాడిన భాష పాత్రోచితమైన వ్యావహారికం గావడాన ఇది సర్వజనాదరణీయమౌతుందనడంలో అసమంజసమేమీ ఉండదు. కవిగారీలాగే మరికొన్ని చారిత్రక వస్తుపూర్ణాలైన కథాసంపుటాలు వెలువరించి సాహిత్య సేవ చేయాల్నని కోరుతున్నాను. వారి కృషికి ప్రజల గుర్తింపు వచ్చి, ఇతోధిక ఖ్యాతి కలగాల్నని కోరుకుంటున్నాను.

పెదపాటి నాగేశ్వరరావు
ప్రిన్సిపాల్
శిల్ప కళాశాల, హైదరాబాదు.

# భూమిక

చారిత్రక విషయాలను సేకరించటం, వాటిని నిశితంగా పరిశీలించటం పరిశోధకుని లక్షణం. సేకరించిన చారిత్రికాంశాలను కథారూపంలో హృద్యంగా చెప్పటం కవి లక్షణం. ఈ రెండు లక్షణాలకు లక్ష్యం శ్రీ లింగమూర్తిగారి ఈ "ఉప్పునూతల కథ".

ఇది అచ్చంపేట తాలూకాలోని 'ఉప్పునూతల' అనే గ్రామానికి సంబంధించిన స్థల చరిత్రను కథారూపంలో చెప్పే రచన.

ఇందులో ఉప్పునూతల గ్రామకథే ప్రధానాంశమైనా ప్రసక్తాను ప్రసక్తంగా లింగమూర్తిగారు మరెన్నో విజ్ఞానదాయకమైన విషయాలను చెపుతూ దీన్ని ఒక విజ్ఞానభాండాగారంగా సంతరించినారు. తెలుగువారి పండుగలు, ఆటలు, నోములు మొదలైన వాటివెనుక ఉన్న ఆంతర్యం, గ్రామనామాలు ఏర్పడే పద్ధతులు, ఆయాశబ్దాలకు సంబంధించిన వ్యుత్పత్తులు-ఇట్లా ఎన్నెన్నో విషయాలు ఎంతో ఆసక్తిజనకంగా వివరింపబడ్డవి, ఇవి తెలుగు సంస్కృతిపైనా, తెలుగుభాషాచరిత్రపైనా శ్రీ లింగమూర్తి గారికున్న అభినివేశాన్ని తెలియజేస్తవి.

లింగమూర్తిగారి రచన ఎంతో సరళరీతిలో సాగింది. అక్కడక్కడా వారు ప్రయోగించిన తెలంగాణా మాండలికాలు వారి రచనకు సహజత్వాన్నీ, సౌందర్యాన్నీ చేకూర్చినాయి. మాసరకు కొన్ని మాండలికాలు:

మస్తుగ - సరం - వడిసిపోవు - పెత్తరమాస
(పది) గల - ఉప్పుకాయించి - సాదు

వినోదంతోపాటు వివిధ విషయాలకు సంబంధించిన విజ్ఞానాన్ని అందజేసే కథాగ్రంథాల్లో శ్రీ కపిలవాయి లింగమూర్తిగారి ఈ "ఉప్పునూతల కథ"కు ఉత్తమస్థానం లభిస్తుందని నా విశ్వాసం.

చక్రతీర్థమాహాత్మ్యం, శ్రీమత్ప్రతాపగిరి ఖండం మొదలైన పద్య కావ్యాలెన్నో రచించి 'విద్వత్కవిభూషణ'గా వాసిగాంచిన శ్రీ లింగమూర్తి గారి లేఖినినుండి ఇంకెన్నో గ్రంథాలు రావాలనీ, అందుకు భగవంతుడు వారికి ఆయురారోగ్యైశ్వర్యాలను ప్రసాదించవలెనని ప్రార్థిస్తున్నాను.

డా. ఆర్. శ్రీహరి
రీడర్
తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాద్.

హైదరాబాద్
12-7-88

---

## కృతజ్ఞత

ఈ గ్రంథములో చేర్పవలసిన "భూమిక" ముద్రణ పూర్తి అయిన పిదప అందినందున ప్రత్యేకంగా ప్రచురించడం జరిగింది. ఆలస్యము జరిగినప్పటికీ "భూమిక" వ్రాసి యిచ్చిన డా. ఆర్. శ్రీహరిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞత తెలుపుకుంటున్నాను.

—కపిలవాయి లింగమూర్తి.

# ఉప్పునూతల కథ

## 1

అనగా అనగా పాలమూరు జిల్లాలో దుందుభీనదీ తీరాన ఉప్పు నూతల అనే గ్రామం ఉంది. ఆ వూరిలో పరంధామయ్య అనే తాతగారు. ఆయనకు గౌరి, కేశవుడు అనే మనుమలున్నారు. వారి తండ్రి పట్నంలో డాక్టరుగా స్థిరపడిపోయినాడు. పిల్లలు దసరా సెలవులకు, వేసవి సెలవు లకు సొంత ఊరికి వచ్చి, తాత బామ్మలతో గడిపి వెళ్లుతారు.

వారు వచ్చారంటే ఆ యింటిలో అదో సందడి. ఆ నాలుగు దినాలు వారు తాతయ్య నడిగి ఎక్కడెక్కడి కబుర్లు చెప్పించుకొని చుట్టుపట్ల నాలుగు స్థలాలు చూసి పల్లెటూరి ఆనందాన్ని అనుభవించి వెళ్లుతారు.

వారు వచ్చి రెండు దినాలయింది.

— ఇక చదవండి —

పరంధామయ్యగారు బ్రహ్మ ముహూర్తంలో లేచి శివస్తుతి చదువు కొని భార్యను పిలిచి "ఈనాడు పెత్తరమాస గదా ! నేను దెందికి వెళ్ళి స్నానసంధ్యలు ముగించుకొని తర్పణాలు విడిచి వస్తాను" అని చెప్పినాడు.

ఆమె "తొందరగా రండి!" అని సెలవిచ్చింది అంతవరకు తాత గారి పారాయణతో మేలుకొన్న పిల్లలు "మాకూ దెందిని చూడాలని ఉంది తాతయ్యా! మేమూ వస్తాం" అన్నారు.

ఆయన దొడ్డిలోనికి వెళ్ళి కొట్టంక్రింద పండుకున్న గానగానిని లేపి "రంగన్నా! పిల్లలు దెందిని చూదామంటున్నారు. బండిగట్టు" అని ఆజ్ఞాపించినాడు.

రంగన్న లేచి కండ్లు నులిమి గొంగడి దులుపుకొని వాకిటిలోనికి వచ్చి బండిని జల్లదీసి పౌణకవేసి సిద్ధంచేసినాడు. ఈ లోపల కేశవుడు ప్రక్క యిండ్లకు వెళ్ళి జత పిల్లలనందరిని పిలుచుకొని వచ్చినాడు.

రంగన్న బండిగట్టగానే గౌరి ముంజాత ఎక్కి ముందుకువెళ్లి కూర్చుంది. ఆమె వెనుక రాధ, శారద, సరస్వతి, రాము, కృష్ణుడు, గోపి ఒక్కొక్కరే బండి నిండినారు. అందరి పిమ్మట తాతయ్య ఎక్కి చివరి భాగంలో వారికి అడ్డంగా కూర్చున్నాడు.

బండి కదిలి తెల్లవారతూ ఉంటె వారిని వాగులో దించింది. పరంధామయ్య బండిదిగి పిల్లలకు ఇక మీరీ యిసుకలో తిరిగి చూడండిరా అని సెలవిచ్చి తన కాలకృత్యాలలో నిమగ్నమైపోయినాడు.

పిల్లలందరూ బిలబిలమని జింక పరువువలె బయలుదేరినారు.

పరంధామయ్య తన పనులన్ని ముగించుకొని స్నానంచేసి అలాగే నదిలోనిలిచి సంధ్య వార్చుకుంటున్నాడు.

సూర్యుడు తూర్పున తళతళలాడుతు ఉదయించి సంగడి వేసిన తాగిబిందెవలె కనిపిస్తున్నాడు. అతని ఎఱ్ఱనికిరణాలు నీటిలోపడి నదిఅంతా రాగిరేకులవలె మెరిసి పోసాగింది. పిల్లలు ఆ మనోహరదృశ్యం చూస్తూ నిలబడిపోయినారు.

శుభాభ్యాం శుభే శోభనే మంగళ ముహూర్తే ...... శ్రీశైలస్య వాయువ్య ప్రదేశే, దుందుభీతీరే రామలింగ క్షేత్రే; అస్మిన్ వర్తమానేన వ్యవహారిక చాంద్రమానేన శ్రీ రౌద్రి నామసంవత్సరే దక్షిణాయనే వర్షర్తౌ భాద్రపదమాసే మహాలయపక్షే అమావాస్యాం......

పరంధామయ్యగారు సంధ్య తర్పణాదులు ముగించుకొని ఒడ్డుకు వచ్చి ధోవతి మార్చుకొని విడిచినదానిని బండపై గబగబా రెండుదెబ్బలు వేసినాడు.

దూరంగా ఉన్నపిల్లలు తాతయ్యగారి అనుష్ఠానం అయిపోయిందని దగ్గరకు చేరుకున్నారు.

చూచినారురా ఇదే దెంది. దీన్ని దుందుభి, దండినగోవ, అనికూడా అన్నారు. ఇది అచ్చంగా మన జిల్లాలోనే షాబాదు కొండల్లో పుట్టింది. దీనికి ప్రాచీనచరిత్ర చాలా ఉంది. ఈ ప్రాంతాన్ని పాలించిన రాజులంతా దీని తీరంవెంట అనేకమైన ఆలయాలు కట్టించినారు, అని చెప్పుతూ ఆయన ఉతికినపంచెను దులుపుతూ మడతలు వేసికొన్నాడు.

తాతయ్య చెపుతూ ఉండగానే దూరంగా ఆలయంనుండి ఘంటా నాదం వినిపించింది.

కేశవుడు అది విని, అదిగో! ఇక్కడనేగూడ ఓ ఆలయం ఉంది గదా - అన్నాడు.

అవునురా రండి ! మనంగూడా అక్కడికివెళ్లి స్వామిని దర్శించి వత్తాము, అని తాతయ్య దారితీసినాడు.

ఆ ఆలయానికి సమీపగ్రామంలోని బ్రాహ్మణుడు అరుణోదయం లోనే వచ్చి పూజించినాడు. పూలు పత్రితో అలంకరింపబడిన గుడిలోని లింగం ప్రసన్నంగా కనిపిస్తుంది.

పరంధామయ్య ఎదురుగానిలిచి కన్నులుమూసికొని చేతులుజోడించి ధ్యానంచేసి నమస్కరించి నందిదగ్గర కూర్చుని దాని శృంగమధ్యంనుండి శివుని దర్శించినాడు.

ఆయన వెనుకే పిల్లలందరూ దేవునికి దండంపెట్టినారు. తరువాత కేశవుడు ఈ దేవుని పేరేమిటి తాతయ్యా! అని అడిగినాడు. అదివిని పూజారి "ఈ దేవుడు ఈశ్వరుడు బాబూ! ఈయననుపూజిస్తే సమస్త సంపదలు కలుగుతవి. ఇలారండి ఇంకా చెబుతాను అని వారిని పిలుచుకొని ఇదిగోచూడండి! ఈయన భైరవుడు. జీవనదులలో స్నానంచేసేఅపుడు ఇతనికి ధ్యానించి నమస్కరించవలె. ఇది నదిలోని ఆలయంకాబట్టి దీని గోడపై శిల్పి భైరవుని మలిచినాడు. ఇదిచూడండి సర్పరాజు. గ్రహణ సమయంలో ఈ నదిలో స్నానంచేసినపుడు ఇతనిని పూజిస్తారు.

గడచిన కీలకసంవత్సరంలో మూసీనది పొంగి పట్నం కొట్టుకొని పోయింది. అప్పుడు ఈ నదిగూడ పొంగి దీనితాలూకు ఈ ధర్మశాల, ఇవన్నీ కొట్టుకొని పోయినవి-అని వారికి చూపించినాడు.

అవి చూచి మరలినపిమ్మట పరంధామయ్య వెంటనడుస్తూ కేశవుడు తాతయ్యా! ఇటువంటి ఆలయం మనూరిలో గూడ ఉందిగదా! మరి దాన్నిగురించి నీవెప్పుడు చెప్పలేదేం? అన్నాడు.

మన ఊరి ఆలయమా! దానికి చాలా పెద్దకథఉందిలేరా! అని దాటవేసినాడు ఆయన.

గౌరి అదిమాసి తాతయ్యా! ఈనాడు మీరింకే కథచెప్పవద్దు. మన ఊరిని గురించే చెప్పవలె - అని నిలదీసింది.

ఆయన అయితే నీతో గట్టిచిక్కే వచ్చిందే అన్నాడు.

కేశవుడు అదివిని తాతగారికి అవకాశంఇస్తూ అయితే మీయిష్టం వచ్చిందే చెప్పండి అన్నాడు.

మాటల్లోనే నడుస్తూ అందరూ బండిదగ్గరకు చేరుకున్నారు. పిల్లలు ఎక్కిన పిమ్మట రంగన్న ఎడ్లనుకట్టి సిపాయిలుతీసి ఎద్దులసందున నిలిచి

ఉపుకాయించి నొగలపైకి ఎక్కినాడు. అదే సమయంలో వెనుకనుండి పరంధామయ్యగూడ ఎక్కినాడు.

బండి కదిలింది.

పిల్లలందరూ తాతయ్య ఏది మొదలు పెడతాడోనని సావధానంగా నిక్కికూర్చున్నారు.

పరంధామయ్య కేశవా! నీవు ''హ్యూయెన్‌త్సాంగు''ను గురించి చదివినావురా అని అడిగినాడు.

చదివాను అయన చైనా వాడటగదా! ఏడో శతాబ్దంలో మనదేశం వచ్చాడని అపుడు దక్షిణ భారతానికి గూడ వచ్చి అమరావతి నాగార్జున కొండలు చూచాడని మా పాఠంలో ఉంది.

నాగార్జున కొండంటే ఏదీ? మన నందికొండేనా! అడిగింది శారద.

అవునమ్మా అదే! ''హ్యూయెన్‌త్సాంగు'' అదేగాదు చుళియ దేశాన్నిగూడ చూచేనాడు.

అదెక్కడుంది తాతయ్యా! అన్నది గౌరి.

ధాన్యకటకానికి నైఋతిగా విస్సారమైన భూములతో అడవులతో దారిదోపిడిగాంఁడ్రతో నిండి ఉండేదని ఆయన వ్రాసినాడు.

అక్కడ రాజు లేడా! సందేహం కలిగింది గౌరికి.

లేకేం పూర్వం దేశాలను రాజవంశాల పేర రాజులను దేశాల పేర గూడ పిలిచేవారు.

అయితే దీన్ని ''చోళులు'' పాలించారా అన్నాడు కేశవుడు. సరిగా ఊహించినావు! పూర్వం కంచి పట్టణాన్ని త్రిలోచన పల్లవుడు అనే రాజు ఏలినాడు. అయన గొప్ప ధార్మికుడు, శ్రీశైల ప్రాంతంలో ఎన్నో

అడవులు నరికించి కొత్త గ్రామాలు కట్టించి బ్రాహ్మణులకు అగ్రహారాలుగా ఇచ్చినాడు. ఆవిధంగా అతడు రాజ్యమేలుతుండగా తమిళ దేశం నుండి "కరికాల చోళుడు" అనే రాజు అయనపై దండెత్తి ఓడించి "రేనాటి"లో ఒక చిన్న రాజ్యాన్ని స్థాపించి వెళ్లినాడు.

అది ఎక్కడుంది తాతయ్యా! అడిగింది గౌరి. మన దేశంలోనే! "రేనాడు" అంటే ఎఱ్ఱని నేలగల దేశం అని అర్థం. "ఎఱ్ఱ" అనే పదం స్వరప్లుతితో (అ+ఏ) జే అవుతుంది. తరువాత నాడు అనే పదం దానికి చేరింది.

ఎరండు=రెండు ఎఱకలు=ఱెక్కలు

ఎల్రపాయం=లేబ్రాయం ఎలమామిడి=లేమామిడి.

అని ఇటువంటి రూపాలు మన భాషలో ఇంకాగూడ కొన్ని ఉన్నవి.

ఈ రేనాడు నేటి "కడపజిల్లా" అని చారిత్రకుల మతం. కడప అంటే తెలుగు దేశానికి "ఢిల్లీ" అనుకో! చోళులు అక్కడ రాజ్యం స్థాపించుకొని విస్తరించిన పిమ్మట వారిలో ఒకశాఖ పొత్తపికి వచ్చింది.

పొత్తపినాటిలో విపినభూమి కిరాతుల కాటపట్టు లో

కోత్తర వన్యవస్తు సముదంచితము-అని ధూర్జటి మహాకవి వర్ణించినాడు.

అది ఎక్కడుంది తాతయ్యా! అన్నాడు కేశవుడు. కన్నప్పకథ చదివినారురా మీరు! అడిగినాడాయన.

చదివినాము తాతయ్యా! అన్నారు పిల్లలంతా. అది మాకు పాఠంగా గూడ వచ్చింది తాతయ్యా! కన్నప్పకు మొదటిపేరు తిన్నడట.

వాడు పుట్టినదేశం పొత్తపి, అంటె! అదిఈ మన కొండల వరుసల్లోనే ఉంది. అని పరంధామయ్య నల్లమలలకేసి చూపినాడు.

పిల్లలు ఆయన చెప్పేదాన్ని శ్రద్ధగానే వింటున్నారుగాని అది ఎందుకు చెబుతున్నాడో అంతుపట్టలేదు.

రంగన్న బండిని మెల్లగా పోనిస్తు ఒకచెవి ఈవైపు ఉంచినాడు.

''తరువాత ?!'' అన్నాడు కేశవుడు.

ఆ పొత్తపి వంశంలో మరో కరికాలుడు పుట్టినాడు. అతనికి నలుగురు కొడుకులు కలిగినారు. వారిలో చివరివాని పేరు దాసవర్మ. అతనివంశం పొత్తపినుండి వేరే ప్రాంతానికి వలసవచ్చి బాగా వ్యాపించింది. అందువల్ల ఆనాటివారు దాన్ని ''చోళవాడి'' అన్నారు. ఆ చోళవాడినే హ్యూయెన్‌త్సాంగు ''చుళియ దేశం'' అని చెప్పినాడని పరిశోధకుల మతం.

ఇంతకూ అది ఎక్కడుంది ? అన్నారు పిల్లలంతా.

ఆ పేరిపుడు మన పాలమూరు, నల్లగొండ జిల్లాలకే సరిపోతుందటరా !

''అయితే హ్యూయెన్‌త్సాంగ్ మన జిల్లాకు వచ్చినాదంటావా తాతయ్యా!'' అన్నది గౌరి కండ్లు పెద్దచేసి.

మరే మనుకున్నావమ్మా! అప్పటి చుళియ దేశంలో ఇప్పటి మన తాలూకా ఒక భాగం అన్నాడు తాతయ్య.

# 2

పరంధామయ్య చెప్పేదివింటు రంగన్న బండిని నెమ్మదిగా తోలుతున్నాడు.

కేశవుడు ఉన్నట్టుండి అయితే అపుడు మన తాలూకా ఏ జిల్లాలో ఉండేది అన్నాడు.

తాతయ్య చిన్నగా నవ్వుకాని నవ్వు ఒకటి నవ్వి అప్పటికి ఈ జిల్లాలు లేవురా !- మీరెపుడైనా "పానగల్లు'' పేరు విన్నారా ! అని అడిగినాడు.

మొన్న మా వాకిట్లో పిచ్చకుంట్లవారు బాలనాగమ్మ కథ చెప్పినారు. అందులో ఆ పేరు వచ్చింది తాతయ్యా ! బాలనాగమ్మది పానుగల్లేనటగా అన్నాడు గోపి.

అవునురా ! ఇపుడు మనకు ఇటు నల్లగొండ పానుగల్లు అటు వనపర్తి పానుగల్లు అని రెండున్నవి. వానిలో రెండోది బాలనాగమ్మదని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు అన్నారు. ఇపుడు నేను చెప్పేదేమో నల్లగొండ పానుగల్లు. అక్కడగూడా ఓ కథ జరిగిందిలెండి ! అనక చెబుతాను.

ఇప్పటి కథ చెప్పండి తాతయ్యా ! అన్నాడు కేశవుడు కొంటెగా. ఓరి ! నీ అసాధ్యంగూల! అదే చెబుతున్నానురా ఇపుడు. ఆ పానుగల్లును రాజధానిగా చేసికొని మన ప్రాంతాన్నంతా మొదట చోళులే పాలించినారు. వారి పిమ్మట దేవరకొండను రాజధానిగాజేసికొని వెలమదొరలు ఏలినారు. వారి నుంచి మొదట దీన్ని బీజాపుర సుల్తానులు జయించుకున్నారు. అంతవరకు మనదేశంలో నాడులు, సీమలు అనే ఏర్పాటుండేది. వారు దాన్ని రద్దుచేసి జిల్లాలు, మహళ్లు అని విభజించారు. కొంతకాలానికి ఈ భాగం బిజాపుర సుల్తానుల నుండి గోలకొండ నవాబుల చేతికి వెళ్లింది. అపుడు వారు దీన్ని జిల్లాల విభాగంమార్చి జిల్లాలు తాలూకాలు అని క్రొత్త ఏర్పాటు చేసినారు.

మొదట మన జిల్లా అంతా నల్లగొండ జిల్లాకు చెంది ఉండేది. "సర్ సాలార్ జంగ్ అవ్వల్" అని పూర్వం నిజాం ప్రభువుల దగ్గర ఒక మంత్రి ఉన్నాడు. ఆయన మంత్రిగాక మొదలు ఒక సామాన్యమైన

ఉద్యోగి. ఆకాలంలో ఒక పర్యాయం కిస్తు వసూలుకు వెళ్ళినాడు. అపుడా యనపై చాలా మంది పెత్తనందార్లు మేము కష్టపడి సాగుచేసికొని మీకు పన్ను ఎందుకియవలెనని తిరుగబడినారు. అది చూచి ఆయనకు జిల్లా పెద్దగా ఉంటే కిస్తు వసూలు చేయటం కష్టమనిపించింది.

ఆనాటికి మన తెలంగాణాలో నల్లగొండజిల్లాయే పెద్దది. అందుచేత ఆయన మంత్రికాగానే సన్ 1292 ఫసిలీలో దాన్ని చీల్చి నాగర్‌కర్నూలు అనే మరో జిల్లాను ఏర్పాటు చేసినాడు.

అప్పటికి ఈ అచ్చంపేట తాలూకాగాదు, మొదట మనకు అమరా బాదు తాలూకా కేంద్రంగా ఉండేది.

అన్నట్టు మీకు మన తాలూకా ఎల్లలు తెలుసురా! అడిగినాడాయన. గౌరి కేశవుడు మొగాలు చూసుకున్నారు.

మా సారుగారు చెప్పినాడు అని రాము అందుకున్నాడు. దీనికి తూర్పుగా కృష్ణానది, దాని అవతల పలనాడు, దక్షిణంగా పాతాళగంగ, దానిఅవతల పెద్ద కందనోలు, పడమట చిన్నకందనోలు, ఉత్తరంగా దెంది దానిఅవతల కలువకుర్తి దేవరకొండలున్నవంట.

మన తాలూకాలో గ్రామాలెన్ని ఉన్నాయో చెప్పినాడా! రెండో ప్రశ్న వేసినాడు తాతయ్య.

నూటానలభై ఉన్నవంట అన్నది రాధ.

విన్నారురా మన తాలూకా ఎల్లలూ గ్రామాలు,- ఈ గ్రామాలలో పేర్లను బట్టిచూస్తే పల్లెలు మొదటవి, పురాలు రెండు, పెంటలు మూడో స్థానంలో నిలుస్తవి. కాని ఉనికిని బట్టిచూస్తే అవి ఒకదానికంటె ఒకటి మొదటివి.

మనది శ్రీశైలభూమి గాబట్టి భక్తికి కొదువలేదు. విఘ్నేశ్వరుడు, మహాదేవుడు, లింగమయ్య, అంబ, ఉమ, భ్రమరాంబ, లక్ష్మి, అనే దేవతలపేర్లలో గ్రామాలు వెలసినవి. అంతేగాక, ఉప్పరి, కుమ్మరి, దాసరి, మేదరి, గొల్ల, తురక, తెలుగు కులాలవారు, గువ్వలవారు, పరాటివారు, మన్నెవారు, మాదనివారు, అనే గుంపులవారు, ఋషులు, తాపసులు, సిద్ధులు, ఘనులు, జనులు, మునులు, బ్రాహ్మణులు, అయ్యవార్లు అనే తెగలవారందరూ తమతమ పేర ఈ తాలూకాలో గ్రామాలు కట్టుకున్నారు.

వీరుగాక ఇంకా నలబదిమంది తమపేర్లతో ఊర్లుగట్టించినారు. వారిలో రంగమ్మ, కామసాని, అచ్చమ్మ అనే స్త్రీలుగూడా ఉన్నారు.

స్త్రీలమాట వినగానే గౌరికి ఉత్సాహం మోసెత్తి అచ్చమ్మ ఎవరు తాతయ్యా అని అడిగింది.

ప్రసక్తి రావలెగాని మన దేశంలో ఏదోఒకచరిత్ర తెలియనివాడంటూ ఉండడు.

అచ్చమ్మ మాటవినగానే రంగన్న అందుకొని ఆమె ఓ దొరసాని తల్లీ! ఆమె తల్లిగారిది దేవరకొండసీమ, అత్తగారిది కొండనాగులంట. వాళ్లయింటిపేరు దేచినేనివారంట - అన్నాడతడు.

అయితే మాకు అచ్చమ్మకథ చెబుతావా! పిల్లలంతా ఏకకంఠంతో అడిగినారు.

"నాకేం తెలుసయ్యా అసుంటివి తాతయ్యగారికేతెలువాలెగాని ...

ఒగప్పుడామె మ్యానాయెక్కి అత్తగారింటి కొస్తున్నదంట. అప్పటికీ అచ్చంపాట గిచ్చంపాట లేదు. ఇక్కడ టంగాపురం, వలపట్ల, నడింపల్లె, పొలిసెట్టిపల్లె పొలిమెర్లు కలిసేవి. ఆనడుమ గడ్డన కొందరు సెంచోల్లు గుడిసెలేసుకొని దానికి పోతుగడ్డ అనిపేరు పెట్టుకొన్నరు.

అచ్చమ్మమ్యానా అక్కడికి రాంగనే వాల్లకుక్కలు గయ్యినలేసి దాన్ని ఆపినై. ఆమెఎంట పనివారిబలగం, దానిలో రాసవారి కుక్కలుగూడ ఉన్నయ్‌గాని అవి సెంచు కుక్కలతో లడాయి సెయ్యలేక తోక ముడుసు కున్నయ్. అదిసూచి అచ్చమ్మ దొరసాని మ్యాన దిగింది. ఆమెను సూడం గానే సెంచులు తమకుక్కల్ని పిలుసుకున్నారు. అపుడామె వాటి బీరాన్ని మెచ్చుకొని ఇది నిజంగా "పోతుగడ్డే" ఇక్కడ నాపేర ఓఊరు గట్టిస్తే బాగుంటది అని మనసుకొచ్చి ఆరాత్రికిక్కడే నిలిసింది. అప్పటికిక్కడ బావాజీ మటంఉంది. దొరసానిగారు మటానికెల్లి బావాజీగారికి దండంబెట్టి రాత్రికి బలగంతోగూడ మటంలో ని'దసేసి ప్రొద్దునే తాను మ్యానదిగిన సోట ఓ పెద్దఅరుగుగట్టించి ఎల్లిపోయింది.

తరువోత ఇంక దానిసుట్టు ఇప్పటి ఊరేర్పడింది. అప్పుడిక్కడ టంగాపురం వలపట్లనే దగ్గెరివి. గావట్టి అవే జరిగి అచ్చంపాట అయిన వంటరు. అచ్చంప్యాటను తొల్త "వలపట్ల" అనే పిలిసేవారంట. మా నాయినగూడ సెప్పంగ యిన్నా! అని ముగించినాడు రంగన్న. తెలియ దంటూనే ఊరికథనంతా చెప్పినావుగదా రంగన్నా! అని పరంధామయ్య అతని నభినందించి, విన్నావమ్మాగౌరీ! అచ్చంపేట ముచ్చట. రంగన్న దేచినేనివారని చెప్పినాడుగదా! వారు కొండనాగులకు మున్ననూరినుండి వచ్చినారట. వారి వంశానికి సంబంధించిన శాసనం ఒకటి ఉమామహే శ్వరంలో వుంది. అది క్రీ. శ. 1898 నాటిది అన్నాడు.

మరి మన అచ్చంప్యాట తాలూకా ఎప్పుడయింది సామీ! అడిగి నాడు రంగన్న.

1292 ఫసిలీలో నాగర్ కర్నూలును జిల్లా చేసినారు. తరువాత ఓ 15 ఏండ్లకు అంటే 1307 ఫసిలీలో అనుకుంటా, అమరాబాదును

తాలూకా చేసినారు. ఆ తాలూకాను 1322 ఫసిలీలో ఇక్కడికి మార్చి నారు. దానితో అమరాబాదు ఇపుడీతాలూకాలో ఒక పట్టీగా నిలిచిపోయింది.

ఇపుడు మన తాలూకాలో

| | |
|---|---|
| అప్పర్ ప్లాటు | లోయర్ ప్లాటు |
| నడిమిపల్లె పట్టి | గోడలుపట్టి |

అని నాలుగు పట్టీలున్నవి. మన గ్రామం ఇపుడు నడిమిపల్లెపట్టీలో ఉంది. అని ముగించినాడు పరంధామయ్య.

# 3

ముచ్చటలో దారి తెలియకుండగనే బండి ఇంటిముందు నిలిచింది.

తాతయ్యకంటె ముంజాతనే పిల్లలంతా బండినుండి దూకి సందడిగా ఇల్లు నిండినారు.

పరంధామయ్య నిమ్మళంగా సదురుకొని దిగి ఇంటిలోనికి వచ్చి తన గదిలోనికి వెళ్ళి భుజంపై ఉన్న పంచె దండెంపై ఆరవేసినాడు.

ఆయన వెనకాలే పిల్లలంతాగూడ గదిలోనికి వెళ్లినారు. వారికింకా ముచ్చటతో గుతిదీరలేదు. ఆయన మంచంపై కూర్చొనగానే చుట్టుముసిరినారు. వారికి అచ్చంపేటను గుఱించి తెలిసిందిగాని తక్కినఊర్లు ఎవరు కట్టించినారనే సందేహం కలిగింది.

వారి ఉత్సాహంచూసి తాతయ్య మళ్లీ మొదలుపెట్టినాడు. పూర్వం రాజ్యాలెంత విస్తీర్ణంగాఉన్నా వాటిలో గ్రామాలసంఖ్య తక్కువ. ఇక చోళవాడి కాకతీయుల కాలంవరకు దాదాపు హర్యాయెన్‌త్సాంగు చెప్పినట్లుగనే ఉండేది.

పూర్వం రాజ్యాలలో గ్రామాలెంత ఎక్కువగా ఉంటె అదిఅంత నాగరిక రాజ్యంక్రిందలెక్క. దాని రాబడిగూడ అంతఎక్కువ. అందువల్ల ఆనాటిరాజులు తమ సామంతులను, చేతిక్రిందినాయకులను క్రొత్తగ్రామాలు స్థాపించటానికి ప్రోత్సహించేవారు. ప్రజలుగూడ అది ఒకపుణ్యకార్యంగా ముందుకు వచ్చేవారు.

పల్లెను క్రొత్తగా కట్టుకున్నపుడు అక్కడి భూమి సాగుకుతేవడం కష్టంగాఉండేది. కాబట్టి రాజుగారు మొదట మూడునాలుగు ఏండ్లవరకు ఆ ఊరిపై ఏ విధమైన పన్ను వేసేవాడుగాదు. అక్కడిభూమి సాగుకుతేవటం కష్టమైనా అంతవరకది బీడుగా ఉండేదిగాబట్టి ఫలసాయాన్ని బాగాఇచ్చేది. అందువల్ల కొత్తపల్లె రైతులకు వసతి కష్టంగాఉన్నా లాభంగా ఉండేది.

తాతయ్యమాటలకు గౌరి అడ్డుతగిలి మనం పల్లె, గ్రామం, నగరం అంటాంగదా! అన్నీ ఒకటేనా! వానికేమైనా తేడాలున్నవా? అని అడిగింది.

అయ్యో! ఎందుకుండవు, పల్లెకంటేగ్రామం, గ్రామంకంటె నగరం పెద్దవి. అవి కట్టేఅపుడు వాటికి పూర్వరంగ కార్యక్రమంగూడ కొంత ఉంటుంది.

ఊరు క్రొత్తగా కట్టడానికి మొదట ఒక స్థలాన్ని ఎన్నుకొని అది గ్రామానికి తగిందో లేదో పరీక్షచేస్తారు. తరువాత అక్కడ ఒక నాభిశిల- అంటె బొడ్రాయి ప్రతిష్ఠిస్తారు. పిమ్మట ఇండ్లకంటె మొదలక్కడ ఏదో ఒక దేవుని నిలుపుకొని అతనికి ఆలయంకట్టి ఆతరువాత ఇండ్లు మొదలు పెట్టుకుంటారు. ఒక్కొక్కప్పుడు అక్కడ దేవుని నిలిపినతరువాత ఊరి కంటెమొదలే ఉరుముకూడ మొదలుపెట్టేవారు. ఉరుముఅంటె జాతర. ఇక పల్లెకు ఈ తతంగమంతా ఉండదు.

పదిమందికలిసి ఒకచోట గుడిసెలు వేసికొంటె అది పల్లెగా చలా మణి అవుతుంది. అక్కడివారు సేద్యం చేసుకోగలిగినంత భూమి దాని ఆయకట్టుగా నిలుస్తుంది.

వెనుకటికి మనదేశంలో పల్లెలే ఎక్కువ. శాతవాహనుల కాలంలో కొండపల్లెలు అంటె అడవి పల్లెలు ఎక్కువ. వానికి ''కొట్టిక''లని పేరు. ఇపుడు మన తాలూకాలోని పెంటలన్ని ఆటువంటివే.

పల్లెలంటె ఒక పది యిండ్లే కాబట్టి అక్కడ పనివారికందరికీ ఉండటం కుదరదు.

అవును ఏలా కుదురుతుంది కనుక. వారికి పొట్ట గిట్టవద్దా! అన్నాడు కృష్ణుడు.

అందుకని వారు నాలుగైదుపల్లెలు కలుపుకొని ఒకదాన్ని కేంద్రంగా చూచుకొని అక్కడ పేట బెట్టేవారు. ఆ విధంగా నలుగురు పనివారు పేట బెడితె అది పల్లె స్థాయినుండి గ్రామస్థాయికి ఎదిగేది. అపుడు దానికొక నాయకుడు ఏర్పడేవాడు. ఆతనికి ''గ్రామకుడు'' అనిపేరు. ఆ పేరే యిపుడు క్రమంగా గాముండు, గవుండు, గౌడుగా మారింది. మన ప్రక్కన ఉన్న కన్నడ దేశంలో ఇప్పటికీ ఊరి పెద్దలందరినీ "గౌడు'' అనే పిలుస్తారు.

పూర్వం ఈ పల్లెలకు, గ్రామాలకు, నిత్యావసర వస్తువులు సరఫరా చేయటానికి ఒక సరుకుల సంఘం ఉండేది. దానికి ''నకరం'' అని పేరు. ఆ నకరాలుండే గ్రామాలు క్రమంగా, నగరాలుగా మారినవి. నగరం నుండే మనకు ''నాగరికత" అనేది పుట్టింది.

బాలుడు యువకుడు, యువకుడు ప్రౌఢుడు అయినట్లు మనపల్లెలు కాలక్రమంగా గ్రామాలుగా, నగరాలుగా మారినవి. ఊరు తన కాళ్లమీద తాను నిలిచినప్పటినుండి అక్కడ పన్నుల వసూలు మొదలు పెట్టేవారు. మొదట అవి నామమాత్రంగా ఉన్నా రానురాను పాలు, పెరుగు, కూరలు కట్టెలు మొదలైన పద్దెనిమిది వస్తువులపై వారు పన్ను కట్టవలసి ఉండేది.

గ్రామాన్ని శాస్త్రీయంగా స్థాపించుకొన్నప్పుడైతే అక్కడ బొడ్రాయి, దేవాలయం మొదలే ప్రతిష్ఠించుకొనేవారు. ఇక పల్లెకు అవి దాని ఎదుగుదల ఆరంభమైనపుడు ఏర్పడేవి. బొడ్రాయి, ఇష్టదేవతల ఆలయం ఏర్పాటు చేసుకున్న తరువాత చెఱువులు కుంటలు వేసికోవటం, సేద్యపు బావులు త్రవ్వుకోవటం వంటి అభివృద్ధి కార్యక్రమాలు ఆరంభమయ్యేవి.

పూర్వం గ్రామాలలో పెద్ద-పెద్ద చెఱువులు వేసినపుడు తమ గ్రామానికి కావలసిన పనివారి నందరిని పిలుచుకొని దాని క్రింద మడులు మాన్యాలు ఇచ్చేవారు. గ్రామానికి ముఖ్యంగా పన్నెండు పనులవారు అవసరం. వారికి ''బారా బలోతాదార్లు'' అని పేరు.

పురోహితో లేఖకశ్చ దేవలక్క ద్వయమేవచ
అయఃకారీ వర్ధకీచ క్షురీచ రజక స్తథా
పాదజః పదవిజ్ఞేయః అంత్యజాతి సమద్వయం
ఏతే ద్వాదశ సీమస్థాః పరప్పర నిరోపకాః.

అని మొగలాయీ లెక్కలలో చెప్పినారు. బాపని, కరణం, తంబళి, కమ్మరి, వడ్రంగి, మంగలి, చాకలి, కాపలి, తలారి, బేగరి, గొడారి అనే పన్నెండు మందికి ''బలవతీలు'' అని పేరు.

అప్పిచ్చువాడు వైద్యుడు
ఎప్పుడు ఎడతెగకపారు నేరున్ ద్విజుడున్
చొప్పడిన యూరనుండుము
చొప్పడ కున్నట్టి యూర చొరకుము సుమతీ !

అప్పు లిచ్చేవాడు, వైద్యుడు, బ్రాహ్మణుడు, ఎప్పుడు పారే జీవనది ఉండే ఊరిలోనే ఉండాలెనంట. లేనిచోట ఉండగూడదంట. మా పంతులుగారు చెప్పినాడు తాతయ్యా ! అన్నాడు గోపి.

అవునురా! అది నిజమే అని ఒప్పుకున్నాడు తాతయ్య. తాతయ్యా ఊర్లను గురించే చెబుతున్నవుగాని పేర్లను గురించి చెప్పటం లేదు. అన్నది గౌరి మాట మలపాలని.

ఆ మాటకు తాతయ్య తెములుకొని వరేయ్ ! మీలో ఎవరైనా మన ఊర్ల పేర్లు ఎట్లా వచ్చినవో చెప్పగలరురా !— అని అడిగినాడు.

ఆ ప్రశ్నకు అందరూ ఆలోచనలో పడినారు. ఒకడు ఖసూచి, ఒకరు దిక్సూచి, ఒకరు అధసూచి అయినారు.

కొంచెం సేపటికి రాము తేరుకుని మన ఊర్ల పేర్లన్నీ స్థలవాచకాలు గానే కనిపిస్తున్నవి తాతయ్యా ! చెప్పనా !!!

| | |
|---|---|
| గుట్టలపల్లె-పర్వతాపురం | గిరివాచకాలు |
| గుండ్లపల్లె-బండపల్లె | శిలా వాచకాలు |
| మేడిపూరు-వేపూరు | వృక్ష వాచకాలు |
| కానాపురం-వనపట్ల | అటవీ వాచకాలు |
| కొమ్మనిపెంట-భీకనిపెంట | పెంటల పేర్లు |
| సోగూరు-నిడుదపల్లె | స్థల వాచకాలు |

అని గబగబా ఏకరువు పెట్టినాడు. అదివిని రాధ నేను కొన్ని చెప్పనా ! అని ఉత్సాహం చూపింది.

సెబాష్ ! ఏదీ చెప్పమ్మా ! చూదాం అన్నాడు పరంధామయ్య.

| | |
|---|---|
| ఆవులవాని బావి, వెంకటేశ్వర్ల బావి | బావుల పేర్లు |
| గోవులగుండం, మద్ది మడుగు | మడుగుల పేర్లు |
| మంగలికుంట, అవుసలి కుంట | కుంటల పేర్లు |
| వెన్నచెర్ల, జడ్చర్ల | చెరువుల పేర్లు |

రాధ మాటలు వినుకుంటు పరంధామయ్య ఈ కుంటలున్నవే అవి అన్ని నిజంగా కుంటలుగావురా ! అన్నాడు.

అయితే మరేమిటి ! అన్నట్టు సందేహంగా చూచినారందరు. కుంట అంటె గుంత ప్రదేశంరా! పూర్వం ఊరు గుంతపాటున ఉన్నపుడు దాన్ని కుంట అని పిలిచేవారు. ఇప్పకుంట, జినకుంట, మోదుగులకుంట అటువంటివే కాని నిజానికి అక్కడవేసిన కుంటలు లేవు.

నీరునేల అంటె తరిపొలం గుంతగా ఉంటుంది కనుక అందుకే దాన్ని మడులుగా కట్టుకొని కుంటలని, మెట్టపొలాన్నేమో ఖండికలని లెక్కించినారు. ఖండిక అంటె ఏమిటి ? తునుక. ఇక్ష్వాకుల కాలంలో భూమిని నాగండ్లతో కొలిచినారు. ఒక్కనాగలితో దున్నదగినంత నేలకు ఆనాడు ''హలం'' అని పేరు. ఆ తరువాత దాన్ని పంటనుబట్టి కొలిచినారు. ''ఖండి'' అంటె పుట్టికనుక దాదాపుగా ఒక పుట్టెడు పండేనేలను ఖండ్రిక అనిపిలిచినారు.

''తాతయ్యా ! మనం ఇన్ని చెప్పకున్నాంగాని అసలు మన ఊరి పేరేరాలేదు'' అన్నది గౌరి.

ఆయన మనుమరాలిని ఆశ్చర్యంగాచూసి ''చూసినారురా మనం గమనించనే లేదుగాని ఇది దొంగను పట్టుకున్నది'' అన్నాడు.

అందరూ గౌరివైపు ఏమిటి అన్నట్టు తలత్రిప్పినారు.

లోపలినుండి భూదేవమ్మ కడపముందుకు వచ్చి "ఏమండీ ! మీరినాడు తెమిలే అట్టులేదు. ఇంటిలో ఉప్పతో తొమ్మిది నిండుకున్నవి'' అన్నది.

బామ్మ మాటలు వినగానే ఇక కథకంచికి వెళ్ళినట్టే అని గౌరి, కేశవుడు మొగమొగాలు చూసికొన్నారు.

కేశవునికి బామ్మపై లోలోపల చెప్పరానంత కోపం వచ్చింది

పరంధామయ్య "ఒరేయ్! ఇంక ఈనాటికి ఆపుదాముఁరా! లేకుంటె మీ బామ్మ దండి సత్యాగ్రహం చేస్తుంది" అని లేచినాడు.

# 4

గది దాటి వెలుపలికి వస్తున్న పరంధామయ్యకు భూదేవమ్మగారు లోపలినుండి ఒక సంచి, ఒక డబ్బా తెచ్చి యిచ్చింది.

అవి అందుకొంటు ఆయన ఈపూటకి ఏవేవి కావాలో చెప్పవే అన్నాడు.

గౌరి ఉప్పుతో తొమ్మిది అన్నది బామ్మ గొంతుకతో. చాల్లేవే! రేపు పెండ్లి అయ్యాక అతగాడికి నీవు చెప్పక పోతావేమో నేను చూడక పోతానా! అన్నది భూదేవమ్మ.

కేశవుడు ఉప్పుతో తొమ్మిదంటె ఏమిటి తాతయ్యా! అని అడిగినాడు.

ఘటః పటం జలం కాష్ఠం, తండులం తైలమేవచ
శాక మగ్ని సమాయుక్తం లవణం నవసంయుతం

అని ఆయన ఒక శ్లోకం చదివి ఇపుడిందులో కావలసిన వేమిటే అన్నాడు.

ఆమె "షష్ఠమం సప్తమం అంత్యం" అని మరో ప్రతిశ్లోకం చదివింది.

పిల్లలిద్దరు బామ్మ తాతయ్యల పరిహాసాలకు కన్నులతో మాటాడుకున్నారు.

పరంధామయ్య అర్థంకాలేదురా! అని నవ్వి కుండలు, నీళ్ళు, కట్టెలు, నిప్పు, బట్టలు, బియ్యం, కూరలు, నూనె, ఉప్పు, ఇవిరా

ఉప్పుతో తొమ్మిది. ఇపుడు మీ బామ్మ చెప్పినవి ఆరోది, ఏడోది, చివరిది, అంటె నూనె, కూరలు, ఉప్పు, అనుకుంటు బయటికి వెళ్ళినా డాయన.

రాము, కృష్ణ, శారద, రాధగూడ ఎవరింటికి వారు వెళ్ళినారు. వీథికి వెళ్ళిన పరంధామయ్య ఓ గంటసేపటికి డబ్బాతో నూనె, సంచిలో ఉప్పు, కూరలు పట్టుకొని వచ్చినాడు.

భూదేవమ్మ వంటఇంటిలోనుంచి వెలుపలికి వచ్చి అవి అందుకొని వెళ్ళింది.

తరువాత ఆయన కేశవుని కేకవేసి పిలుచుకొని "ఉప్పును గురించి ఓ మాంచికథ జ్ఞాపకం వచ్చిందిరా! చెబుతావిను" అని గదిలోనికి వెళ్ళి కబుర్లలో పడిపోయినాడు.

తాతయ్య పిలుపువిని వంటయింటిలోనికి బామ్మ చేతికిందికి వెళ్ళిన గౌరి మెల్లగా మళ్ళీ బయటికి వచ్చింది.

తాతయ్య మాటలు విన్న కేశవునికి ఆయన బుఱ్ఱలోనుంచి ఊర్ల విషయం బొత్తిగా తొలగిపోయింది అనిపించింది. ఆయనది ధోరణియే ధోరణి. ఎప్పుడేం చెబుతాడో, ఏది మొదలుపెట్టి దేనితో ముగిస్తాడో! నిమిత్తమాత్రంగా వినవలసిందేగాని కావలసినదాన్ని వలసినట్లు చెప్పించుకునే అధికారం ఎవరికీలేదు.

ఆయన మొదలుపెట్టినాడు.

మన ప్రాచీనాహారంలో నేయి ఉప్పు రెండే ప్రధానంగా కనిపిస్తవిరా. శ్రీకృష్ణుడు గీతలో-

ఆయుస్సత్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః
రస్యాః స్నిగ్ధా స్థిరాహృద్యా ఆహారస్సాత్త్విక ప్రియాః అ. 17-8.

కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకా మయప్రదాః 17-9

అని చెప్పినాడు. నేయితో గూడిన ఆహారం ఆయుష్యాన్ని, బలాన్ని, ఆరోగ్యాన్ని వృద్ధిచేస్తూ సాత్వికులకు ప్రియంగా ఉంటుంది. ఉప్పుకారంతో గూడిన ఆహారం జీర్ణకోశానికి కఠినమై దుఃఖాన్ని కలిగిస్తుంది. అది రాజసులకు ప్రియమై ఉంటుంది అని తాత్పర్యం.

ఆహారంలో శ్రీకృష్ణుడు నేయికే ప్రాధాన్యమిచ్చినా, నరుడుమాత్రం ఉప్పునే ఎక్కువ కోరుచున్నాడు.

అతడు వెన్నదొంగగదా! తాతయ్యా అన్నాడు కేశవుడు.

అవునురోయి! బాగా కనిపెట్టినావు, వెన్నతిని అతడు జ్యోతివలె వెలిగిపోతె, మనమేమో ఉప్పుతిని ఉప్పరిల్లి పోతున్నాము.

ఉప్పుతిన్న ప్రాణం ఊరుకోదు అని సామెత. అది ఏదో ఒక అల్లరి చేస్తూనే ఉంటుంది. అందుకే పూర్వం గురుకులాలలో క్షార లవణాలు లేని ఆహారం ఉండేది. ఇపుడు మన విద్యార్థులు షడ్రుచులు అనుభవిస్తున్నారు కాబట్టి చెప్పలేని అల్లరి చేస్తున్నారు.

ఆహారంలో మనకు అదనంగా ఉప్పేంఅక్కర్లేదట. మనం వాడే ఆహార వస్తువులలోనే దేనికిసరిపడేఉప్పు దానిలోనే ఉందట. ఒకప్పుడు మా మాష్టారుగారు చెప్పాడు అన్నాడు కేశవుడు.

ప్రకృతి వైద్యంగూడా అలాగే చెబుతుందికాని వారెంతగా కూడదన్నారో, లవణానందస్వామి అనే సన్యాసి అది మనకు అంతగా అవసరం అని చెప్పినాడు.

పూర్వం ఫ్రెంచిరాజులు తమసైన్యానికి ఉప్పు కొనుక్కోవటానికి నెలనెలా కొంత డబ్బిచ్చేవారు. ఆ భాషలో ఉప్పును "శాలేరియం" అంటారు కాబట్టి మనకు "శాలరీ" అనేపదం దానినుండే వచ్చింది.

ఆయితే మనం తెలుగులో దాన్ని ఏమనాలె తాతయ్యా! అడిగినాడు వాడు.

అక్కరలేదురా! అలాగే వాడుకోవచ్చు. కొన్ని పదాలకు అర్థం చెప్పుకుంటే ఇపుడు మనం వాడుతున్న అర్థం చెడిపోతుంది. ఉదాహరణానికి ''సైకిలు'' అంటే ఇంగ్లీషువారికి చక్రం మాత్రమే. అది యిపుడు మనకో వాహనం, ''రైలు'' అంటే వారికి ఇనుప పట్టా మాత్రమే. మనకేమో అది దానిపై నడిచే బండి. మోటారు అంటె వారికి యంత్రం గలిగిన బండి. ఇటువంటి పేర్లింకా చాలా ఉన్నవి కాబట్టి అన్యదేశ్యాలైన పేర్లను రూఢిచిబట్టి అలాగే వాడుకోవచ్చు. అనువాదం చేసుకోవలసిన అవసరం ఉండదు.

మొదట ఏదో అర్థంలో పుట్టి తరువాత ఏదోఅర్థంలో నిలిచిపోయిన పేర్లు మనభాషలోగూడ మస్తుగనే ఉన్నవి. వానిని ఆ విధంగానే వాడుకోవలెనని భాషాకారుల మతం. లేకుంటె హనుమంతుడు కోతి అవుతాడు. అది వుండనీ......

మనకు-అంటె హిందువులకు ఉప్పు పవిత్రమయింది. ఎవరి ఉప్పు తింటామో వారికి ద్రోహం చేయగూడదని పూర్వులమతం. తురుకలు గూడ దీన్ని నమ్ముతారు. వారు ఉప్పుతిని ద్రోహంచేసే వానిని ''నమ్మక్ హ్రాం'' అంటారు.

ఈ నమ్మకం ప్రభుత్వంలో గూడ వుంది. అందువల్ల వారు సైన్యంలో లవణ గ్రహణోత్సవంగూడ నిర్వహిస్తారు.

మన జాతీయ సంగ్రామంలో గూడ ఉప్పు ప్రధానపాత్ర పంచుకొన్నది. మహాత్ముడు చేసిన సత్యాగ్రహాలలో అన్నిటికంటె ఉప్పు సత్యాగ్రహమే గొప్పగా విజయం పొందింది. అది నిజంగా దండిసత్యాగ్రహమే.

భూదేవమ్మ గదిముందుకు వచ్చి వంటయిందండీ! అనిచెప్పింది. అయితె పదరా! ఆత్మారాముడు అల్లరి పెడుతున్నాడు, అని లేచినాడు పరంధామయ్య.

# 5

గౌరి కేశవుడుగూడ ఆవేళ తాతయ్యతోపాటే భోజనానికి కూర్చున్నారు.

సరదాగా ఉన్నపుడు పరంధామయ్యకు తింటూకూడ కబుర్లు చెప్పటం అలవాటు.

తాతయ్య ముఖంచూసి గౌరి కాచుకొని కూర్చున్నది. ప్రశ్న ఏ విధంగా వేయవలెనో తోచలేదు. అది గొంతులోనే కొట్లాడుతుంది.

భూదేవమ్మ పచ్చడి, పప్పు, ఒక్కొక్కటీ వడ్డిస్తు అన్నంగూడ పెట్టింది.

పరంధామయ్య "ఓం సహనాభువంతు" అనిచెప్పి పూర్వాపోశనం తీసికొని, ఇంక కానీయండిరా! అని సెలవిచ్చినాడు.

పిల్లలు తినసాగినారు.

రెండు ముద్దలు తిన్నతరువాత పరంధామయ్య ఇదుగో! కాస్త లవణం తెస్తావే! అన్నాడు.

భూదేవమ్మ ఇంత నూరినఉప్పు తెచ్చి అంచున ఉంచింది. గౌరీ! లవణంపైన ఓ కథఉంది. విన్నావే ఎప్పుడైనా! అన్నాడాయన.

ఆ పిల్ల అడుగవలసింది ఆరంభమయిందని లోలోపల సంతోష పడుతు, "ఉహూ!" అని తలఅడ్డంగా ఊపింది.

ఆడపిల్లవు ముఖ్యంగా వినవలసింది చెబుతావిను. ఒకప్పుడు మన వంటి వాళ్లయింటికి ఒకచుట్టం వచ్చినాడు. భోజన సమయంలో ఈలాగే బంతికూర్చుని ఉండగా ఇంటాయన కోడలితో ఏవమ్మా! కాస్త లవణం తెస్తావా! అన్నాడు.

అతిథి అదివిని ఏమయ్యా ! నీ వెంత చదువుకున్నవాడవైతే మాత్రం ఇపుడుగూడ సంస్కృతం మాటాడితె ఏలా! అన్నాడు. అదివిని కోడలు పౌరుషపడి నేను అవధానిగారి బిడ్డను. శాస్త్రుల్లగారి కోడలిని. లవణమంటి ఎరుగనా!- అని చరచరా దొడ్లోనికి వెళ్ళి కాసింత ఆవుపేడ ముక్క తెచ్చి అంచున ఉంచిందట.

తాతయ్య చెప్పేది వింటూఉంటె గౌరికి నవ్వాగలేదు. ఎంత సంబాళించుకున్నా త్రాగుతున్న నీరు సరంలోనుండి ఎగతన్నుకొనివచ్చి కాల్చిన కాకరపువ్వొత్తివలె చిమ్మింది.

భూదేవమ్మ నవ్వులో కోపంగూడ కలుపుకొని ఏమండీ! మీ చెబుకులకు వేళాపాళాలేదా! అని మందలించింది.

గౌరి అంతనవ్వినా కేశవునికది పెద్దచెణుకుగా తోచలేదు. నింపాదిగానే తింటున్నాడు.

ఏమిరా! కేశవా! నీవేమీ అనటంలేదు. అయితె మరొకటి చెబుతాను విను అన్నాడు పరంధామయ్య.

భూదేవమ్మగారు అన్నంతెచ్చి మారువడ్డించింది.

పూర్వం పల్లెటూళ్ళలో పాలుపెరుగుకు లోటులేదుగాని ఉప్పుకరువు. పట్టణ వాసులకు ఉప్పురుచి తెలుసుగాని నేయికరువు.

ఇపుడుగూడా అంతే తాతయ్యా! మాకు మంచి నేయి దొరుకదు, అన్నాడు కేశవుడు.

తాతయ్యను చెప్పనీయి- అన్నది గౌరి.

ఆయన మళ్లీ మొదలుపెట్టినాడు.

ఓపర్యాయం ఒక నాగరిక యువకుడు ఒక పల్లెటూరిలో ఒక ఇంటికి వెళ్ళి భోజనానికి కూర్చున్నాడు ఇంటావిడ ఉన్న పదార్థం వడ్డించి కమ్మని నేయివేసింది. అతడుప్పురుచికి అలవాటుపడ్డాడు గాబట్టి మాసర చప్పరించి "కొంచెంఉప్పు" అన్నాడు. అపుడామె

ఏదో! దొరికినది భుజింపుము లవణంబు
పల్లెటూర నెట్లు వచ్చుమాకు
చెలువుకాడ వినుము స్నేహంబులేకున్న
లవణ మెంతయున్న లాభమేమి? గాథా- 4-16

ఉన్నదేదో తినవయ్యా! పల్లెటూరిలో ఉప్పు ఎక్కడినుండి వస్తుంది మాకు. నేయిలేకుంటె ఉప్పుఎంత వుండి ఏంలాభం? అన్నదావిడ. ఇది శాతవాహనులనాటి మాట.

ఎప్పటి మాటైతేనేం తాతయ్యా! నేయిలేకుంటె- వట్టి ఉప్పుతో మనంమాత్రం తింటామా ఏం? అన్నాడు కేశవుడు.

తినముగాని ఇందులో మరో రహస్యముందిరా!

తాతయ్య మళ్లీఏదో క్రొత్తది చెప్పబోతున్నాడని అనుకున్నది గౌరి. ఉప్పులేకుంటె నలమహారాజు వండినా సరే కూరకు రుచిరాదు. లవణం తినకుంటె రంభకైనాసరే లావణ్యం ఉండదు. భోజనంలో ఉప్పులేకుంటె రుచేగాదు మనశరీరానికి అందంకూడా లేదన్నమాట. శాస్త్రికారులీ ఉప్పు వల్ల కలిగేసౌందర్యాన్నే లావణ్యం అనిపిలిచినారు.

ఇక స్నేహమంటె నేయేగాదు, ప్రేమగూడా... పల్లెటూరి పడుచులలో పైమెరుగు తక్కువగాని మనస్సులో ప్రేమ నిండుగా ఉంటుంది.

పట్టణ వాసుల్లో పైమెరుగు అంటె లావణ్యం కావలసినంత ఉంటుందిగాని మనస్సులో ప్రేమతక్కువ కాబట్టి హృదయంలో స్నేహమనేది లేకుంటె పైమెరుగు ఎంతఉండి ఏంలాభమని ఇందులో నీతి.

నీవెప్పుడైనా అందాని కాశపడి పట్నంపడుచుల కాశించకు. లక్షణంగా ఓ పల్లెటూరి పిల్లనే పెండ్లిచేసికో- అన్నాడు తాతయ్య.

ఏమండీ మీలక్షణాలన్ని ఇప్పటినుంచేనా వానికి వంటబట్టించటం అని మందలించింది భూదేవమ్మ!

లక్షణాలుకాదే - ఇందులోఉండే ధ్వనిని చెబుతున్నా!

నేను అంటున్నది అదేనండి! మీరే అంటుంటారుగదా! ఇక్కడ లక్షణ అని, ఇక్కడ వ్యంజన అని, ఏదో అని-

పరంధామయ్య ఆమెమాట వినిపించుకోలేదు. మన సాహిత్యంలో ఉప్పునుగురించి ఇటువంటి చమత్కారా లింకా ఉన్నవిరా అబ్బాయి. మరాఠీభాషలో "కందపురాణం" అని ఉల్లిగడ్డపై ఒక పురాణమే ఉందట. చైనాభాషలో తేనీటిపై ఒక పురాణం ఉందట.

మరి ఉప్పుమీద ఎందులోఉంది తాతయ్యా! అన్నది గౌరి. ఎందులో లేదే! అది మీతాతగారి నోటిలోనే ఉంది అన్నది భూదేవమ్మ నవ్వుతూ.

కేశవా! నీవెప్పుడైనా "పాకాల" మాట విన్నావురా! అని విషయం మార్చినాడు పరంధామయ్య.

వినలేదుగాని మా తెలుగు మాష్టారు అపుడపుడు పద్యాలు చదువుతు ఇది ఈ పాకంలో ఉంది- ఇది ఈ పాకంలో ఉందిరా- అంటుంటాడు. అవేనా నీవడిగేది?

అవేనోయ్! ...... ఇపుడు నీవు తినే కూరేమిటి?

వంకాయ-

వంకాయ వంటి కూరయు
పంకజముఖి సీతవంటి భామామణియున్
శంకరుని వంటి దైవము
లంకాధిపు వైరికంటె రాజును గలడే !

అని ఒక శాకపార్థివుడు వంకాయను మెచ్చుకున్నాడురా ! ... ...ఇప్పటి కూర ఏలా ఉందంటావు. మాంచి రుచిగా కుదిరింది గదూ, మీ బామ్మ గారి చేతి మహాత్మ్యం మరి ! ...... ఈలాగే కవులలో గూడ ఒక్కొక్కరి చేతిపనికి ఒక్కొక్క రుచి ఉంటుంది. దాన్నే లాక్షణికులు పాక మని పిలిచినారు.

పద్యాలలో గూడ పాకమేమిటి తాతయ్యా ! అన్నది గౌరి. పాకం ఒక్క కూరకే ఉందనుకున్నావే ! వార్తాక పాకం, తింత్రిణీ పాకం, క్షీర పాకం అని కవిత్వంలో గూడా ఉన్నవి. అవి చదువుతుంటే మీ బామ్మ చేతి వంకాయకూర, చింతపండు బజ్జి, పాయసం రుచి చూస్తున్నట్టే ఉంటుంది.

అయ్యో ! లవణపాకం మరిచినారేమండి ! అన్నది భూదేవమ్మ పొరపాటును సవరిస్తున్నట్టు.

అది ఏలాగుంటుంది తాతయ్యా ! అని అడిగింది గౌరి అమాయకంగా చూస్తూ.

రేపుచేసి చూపెడాతాలేవే ! అన్నది భూదేవమ్మ. కొంపదీసి అంత పని చేసేవు సుమా ! అని నవ్వినాడు తాతయ్య. కేశవునికి అది కొంచెం అర్థమై ముఖంపై దరహాసం తొణికిసలాడింది.

# 6

రాత్రికి వారు మళ్ళీ ఊర్ణకథ చెప్పించుకోవాలనుకున్నారు గాని అది పడలేదు.

సాయంకాలానికి ఒక అవాంతరం ముంచుకు వచ్చింది. రాము కేశవుడి దగ్గరకు వచ్చి ఏదో గుసగుసలాడి వెళ్ళినాడు. దానితో అతని ధ్యాస మారిపోయింది.

రాము వెళ్ళిన పిమ్మట వాడు చెల్లెలితో గౌరీ! రాత్రికి నీవొక్కతివే కథ చెప్పించుకుంటావా ! అన్నాడు.

ఎందుకూ! నీవెక్కడి కెడతావు!-సూటిగా అడిగింది గౌరి. అదంతా నీకెందుకు ? దబాయించినాడు వాడు.

తాను వెళ్లేపని చెబితే అది తాతయ్యతో చెప్పి దానికేదో అడ్డుపుల్ల వేయిస్తుందని వానిభయం.

కేశవుడు లేకుంటె తాతయ్య కథచెప్పడేమోనని అనుమానించి గౌరి ఆనాటికి తనకోరిక నుపసంహరించుకొన్నది.

అది ఆశ్వీజమాసం. శుక్లపక్షపు దినాలు. చీకటిపడగానే నెలపొడిచి నేలంతా పిండి జల్లెడపట్టినట్లు వెన్నెలకాసింది. ఆ వెన్నెలలో వీథిలోని వాకిండ్లలో ఆడపిల్లలంతా బ్రతుకమ్మలను పెట్టుకన్నారు.

గౌరి సినిమాలు చూసిందిగాని యిటువంటి పల్లెటూరి ఆటలు చూసిఎరుగదు. అందువల్ల అవి ఆమె నాకర్షించినవి.

వీథిలోనికివెళ్లి కాస్సేపు అవిచూసి వచ్చి పండుకున్నది. మరునాడు కేశవుడు కనిపించగానే పరంధామయ్య, ఏమిరా, రాత్రి ఎక్కడికి వెళ్లినావు ! అని అడిగినాడు.

వానికి చెప్పటానికి జంకు కలిగింది.

చెప్పవేమిరా! అని తాతయ్య రెండోసారి అడిగినాడు.

వానికి ఇక చెప్పక తప్పదని అర్థమయింది. భయంభయంగా, ఆటకు ......జతగాళ్లువస్తే ......అని అర్థోక్తిలో ఆగినాడు.

వెన్నెలరాత్రిలో ఆడే ఆటలేమున్నవబ్బా ఇపుడు, అని పరంధామయ్య ఆలోచనలో పడినాడు.

"ఉప్పుగెర" ఆడాము ! తాతయ్యా ! అన్నాడువాడు.

ఉప్పుగెరా ! చాలా పాతఆటనే ! అన్నాడాయన.

ఏంగాదు తాతయ్యా ! అన్నాడు వాడు ధైర్యంగా !

పిల్లకాకివి నీకేం తెలుసులేరా !

"ఉప్పనబట్టె లాడఁనెడ నుప్పులు దెత్తురుగాక యాదవుల్"

అని పదునాలుగో శతాబ్దంవాడైన నాచనసోముడు ఈ ఆటను చెప్పినాడు. ఉప్పుగెరా ! బిళ్లంగోడి ఇప్పుడాడే వారెవరున్నారు అని నిట్టూర్చి నాడాయన.

ఏం ? ఆడగూడదా ! అడిగినాడు వాడు అమాయకంగా. కూడదని కాదురా ! అసలు ఆటలంటె అవే ! ఈనాటి ఆటల్లో అర్థం - పర్థం ఏముందని ?

ఆటల కేమర్థముంటుంది తాతయ్యా ! అని పకపక నవ్వినాడు కేశవుడు.

నీకేం తెలుసురా! మన ఆటలవెనుక వుండే రహస్యం ? రాత్రి నీవు ఉప్పుగెర ఆడినావు గదా ! అది వెనకటి వారెందు కేర్పరచుకున్నారో తెలుసా !

కేశవుడు కండ్లు తేలవేసినాడు.

పూర్వం మనవారేపని ఆయినా "ఇషుకేటులు" లేకుండా చేసే వారు గాదుతా ! అందుకోసం వారు కొన్నిటికి ఆటలే రూపొందించు కున్నారు. అటువంటి వానిలోకే ఇది ఒకటి.

వెనుకటికి మనదేశంలో ఉప్పులేదు. దాన్ని ఉప్పుకొటారులకు వెళ్ళి తెచ్చుకోవలసి వుండేది.

అవి ఎక్కడున్నాయి తాతయ్యా అన్నది గౌరి.

సముద్రతీరంలో. మన ప్రాంతం వారంతా పూర్వం కురువమీది గూడూరుపై నుండి ఉప్పుకొటారుకు పోయేవారు. ఆ గ్రామం ఇపుడులేదు. అడుగుమారి "మారడుగు" అయింది. వ్యాపారులు అక్కడినుండి ఉప్పు తెచ్చే అపుడు కరోడ్గిరి ఆఫీసర్లు దానిమీద తలకుమించిన సుంకం వేసే వారు.

బ్రిటిష్‌వారు గూడా అలాగే వేసేవారట తాతయ్యా! గాంధీగారుప్పు సత్యాగ్రహం అందుకే చేశారని మా పాఠంలో ఉంది. అన్నది గౌరి.

అవునమ్మా! అందుకే వెనకటివారు దాన్ని తెచ్చే అపుడు అక్కడ వుండే సుంకరుల కండ్లలో కారం గొట్టటానికి నానాపాట్లు పడే వారు. ఓ పర్యాయం ఒక వ్యాపారి అలాగే చేదామని అర్ధరాత్రి లేచి నిండు బండితో బయలుదేరి దారితప్పి కాడుబడి తిరిగి తిరిగి తెల్లవారేవరకు మళ్ళీ సూటిగా సుంకంరేవు దగ్గరికే వచ్చినాడట.

అయ్యో పాపం! అన్నది గౌరి.

అరే! అని ఆశ్చర్యపడినాడు కేశవుడు.

సంస్కృతంలో ఇప్పుడది "ఘట్టకుటీ ప్రభాతన్యాయం" అని ఒక సామెతగా నిలిచిపోయిందల్లా! వద్దని తప్పించుకున్నపని చేయవలసి వచ్చినపుడు ఇపుడూ సామెతను వాడుతుంటారు. కాబట్టి అటువంటి పొరపాట్లు జరుగకుండ వుండే అందుకే మనవారు ప్రతిదాన్ని ఒక కళగా అభ్యసించినారు.

ఉప్పు తెచ్చేవాడు ఎవరెవరిని ఏవిధంగా తప్పించుకోవలెనో శాస్త్రం తెలిసింది గదరా కేశవా! నీకు.

తెలిసింది తాతయ్యా! రాత్రి మేము పాముగెరపై నిలిచిన వాని పులుసు తీశాము.

చూసినావా! ఆ పాముగెరపై ఉండేవాడు అంటె సుంకం అధికారి అన్నమాట. మన ఆటల్లో ఏ రహస్యం లేదన్నావు గాని యింకా ఇటు వంటివి చాలా ఉన్నవి.

త్రేతాయుగంలో మండోదరి చదరంగం ఆటతో రావణబ్రహ్మకు యుద్ధం నేర్పిందట. శాతవాహన చక్రవర్తికి తల్లి కోటముందు ముగ్గులు వేస్తూ సైనికవ్యూహాలు పన్నటం నేర్పిందట. కోతికొమ్మచ్చితో పూర్వం యోధుల పిల్లలు కోటలు ప్రాకటం నేర్చుకొనేవారు.

గౌరి పరంధామయ్య చెప్పేది కేశవుని కంటె శ్రద్ధగా విన్నది.

ఆమె కాశ్చర్యం వేసి, అయితే ఆడపిల్లల ఆటలలో గూడ ఇటు వంటి రహస్యాలున్నయ్యా తాతయ్యా! అని అడిగింగి.

లేకేవమ్మా! ఇంతకుమించి ఉన్నవి. అన్నాడాయన.

# 7

ఉప్పుగెర విన్నతరువాత గౌరి ఊర్లనుగురించి మరచి పోయింది. ఆమెకు రాత్రికి బ్రతుకమ్మను గురించి చెప్పించుకోవాలని పడింది. కేశవుని దగ్గరకువెళ్ళి, రాత్రికి తాతయ్యను బ్రతుకమ్మల దగ్గరకు తీసుకు వెడదాము. వాటిని గురించి ఆయన ఏంచెబుతాడో విందాము అంది.

అంతవరకు ఊర్ల గొడవ విసుగుగా అయింది గాబట్టి కేశవుడు దానికి అంగీకరించినాడు.

ప్రొద్దు మూకగానే ఇద్దరూ బామ్మనడిగి అన్నంపెట్టించుకొని తిని పరంధామయ్యతో, ఈనాడు మాకు బ్రతుకమ్మను చూపండి! అనిఅడిగినారు.

భూదేవమ్మ వారికి వత్తాసుగావచ్చి, పిల్లలు ముచ్చటపడుతున్నారు. పట్నంలో వారెక్కడ చూస్తారుగనుక. అలా తెలుగు గేరికివెళ్ళి చూపించు కొనిరండి. అక్కడైతె పెద్దపెద్ద ఉద్దులేస్తుంటారు అన్నది.

పరంధామయ్య భార్యమాట తీసివేయలేక తానుగూడ సాయం కృత్యాలు తీర్చుకొని పలహారంకానిచ్చి వారిని తీసికొని బయలుదేరినాడు.

వారి ఇంటినుండి రెండుమలుపులు తిరిగితె తెలుగువారి గేరివుంది.

ఆ గేరిలోని పడుచులంతా పగలల్లా పొలంపనులకు వెళ్ళి వచ్చే అపుడు తలాకాసిన్ని తంగేడు, ముద్దబంతి, రుద్రాక్ష, గన్నేరు పూలు పట్టుకొని వస్తారు. ఇల్లుచేరిన పిమ్మట తిండితిప్పలు చూసుకుని తాము తెచ్చినపూలు ఒక స్తాంబాళంలో వలయంగా శిఖరంవలెపేర్చి దాన్నిఒక పీటపైవుంచి, వీథిలోపెట్టుకొని ఒక పెద్దమనిషి పాట చెబుతుండగా రాత్రి బాగా ప్రొద్దుపోయేవరకు బ్రతుకమ్మను వేస్తారు.

పరంధామయ్య పిల్లంను తీసికొని వెళ్ళేవరకు అక్కడ ఉద్దిమొద లయ్యింది.

ఆయనను చూడగానే పాట చెప్పే వృద్ధురాలులేచి, అయ్యగారు సూద టానికే వచ్చిన్రా!'' అని లోపలికివెళ్ళి ఒక పీట తెచ్చివేసింది.

పరంధామయ్య పీటపై కూర్చుంటు, "మీరు కానీయండి! మా పిల్లలు చూస్తారట'' అని సెలవిచ్చినాడు.

అయ్యో! మీరినదగిన పాటలు మాకేవొస్తయ్ గన్క? ఇదేం రామా న్నెమా! ఇరాటిపురానవా! అన్నది పాటగత్తె.

ఎందుకు లచ్చి! రామాయణము, భారతమే వినవలెగాని మీ పాటలు వినగూడదా! అట్లాఅని ఎక్కడాలేదు. కానీయి! జాప్యం చేయవాకు. పాట ఎత్తుకో! అన్నాడు పరంధామయ్య.

అయితె వినండి! అని ఆమె పాట ఎత్తుకున్నది.

ఉద్దివారంతా 'నుడుగు' అందుకొని చప్పట్లు చరవటం మొదలు పెట్టినారు.

ఉప్పు గోనెలొచ్చి వలలో | ఊళ్లో దిగినాయి వలలో
ఉపకారి నామరది ,, | ఊళ్లో లేదమ్మా! ,,
సందు బొందుల లేడు,, | సభలోన లేడు ,,
ఎప్పుడు వుండేటి ,, | ఎదురింటలేడు ,,
అచ్చన్న లాడేటి ,, | రచ్చల్లో లేడు ,,
బొంగరాలాడేటి ,, | బోదెల్లొ లేడు ,,
రాగిచెట్టొ మీది ,, | ఓరామ చిలుకా ,,
నీవైన జూచితివే ,, | మరదీ పోకడలు ,,
నేజూడ లేదమ్మా ,, | ఎసువంటి వాడు ,,
చలువావి పంచెల్లు ,, | చక్కా నంగీలు ,,
ప్రక్కన మెరసేటి ,, | చుక్కా మొలత్రాడు
ధగధాగ మెరిసేటి ,, | దండె కడియాలు ,,
వ్రేళ్లల్లొ మెరిసేటి ,, | వెండుంగరాలు ,,

ముసలమ్మ గొంతులోనుంచి ఒక కోకిలమ్మ పాడుతుంది. గౌరి శేషుడు చెవులు ఆలకించుకొని పాటలో లీనమై పోయినారు. మైమరిచి పోయిన పరంధామయ్యగూడ కాస్సేపటికి తేరుకుని, ఇక వెళ్లుదామురా! అన్నాడు.

వారికి కదలబుద్ధి వేయలేదు.

మనసంతా అక్కడే పెట్టి దేహాన్ని తాతయ్యవెంట నడిపించినారు. ఇల్లు చేరినపిమ్మట ఆయన "గౌరీ! చూసినావుగదా! బ్రతుకమ్మను" అని అడిగినారు.

ఆమె చూసినా నన్నట్టు తలఊపింది.

భూదేవమ్మ భోజనం ముగించుకొని లోపలినుండివచ్చి, ఏమండీ! దీన్ని దసరాముందే ఎందుకు వేస్తారు అని అడిగింది.

అడిగినావా! ఆలా కూర్చోవే! అన్నాడాయన.

ఆ మాటలువిని గౌరికి కేశవునికి మనస్సు మళ్లీ స్వాధీనంలోనికి వచ్చింది.

గౌరి శరీరమంతా చెవులుచేసికొని కూర్చున్నది.

భూదేవమ్మ, చెప్పండి! అని నిమ్మళంగా గోడ నానుకుని కూర్చున్నది.

కేశవా! పోయిన తెలుగునెల ఏమిట్రా! అని అడిగినాడు తాతయ్య. వాడు కొంచెంసేపు లోలోపల గుణించుకొని ''భాద్రపదం'' అన్నాడు. ఆ నెల ఉందిగదా! దానిలో చివరిదినాలకు మహాలయపక్షం అనిపేరు. ''మహాలయం'' అంటే ''ప్రళయం'' అని అర్థం. ఈ సృష్టికంటె పూర్వం ఒక పెద్దజలప్రళయం జరిగింది. అది జరిగిందని కొరాను బైబిలుగూడ చెబుతాయట. అయితే అది ఈ భాద్రపదంలోని చివరిదినాలలో జరిగిందని, అందుకే ఆ దినాలకు మహాలయం అనే పేరువచ్చిందని మన పురాణాలు చెప్పుతవి.

ఆ ప్రళయం ముగిసిన పిమ్మట బ్రహ్మదేవుడు నిద్రనుండిలేచి పునస్సృష్టిని ఆరంభించి దాన్ని ఆశ్వీజమాసంలోని మొదటి తొమ్మిది దినాలలోనే ముగించినాడట.

సృష్టి అంటె మళ్లీ జీవారంభంగదా! జీవితాన్ని బ్రతుకు అంటాము గాబట్టి ప్రాణికి అధిదేవతను ఇపుడు మనం ''బ్రతుకమ్మ'' అని కొలుస్తున్నాము.

శివుడు కోపించి మన్మథుని కాల్చివేసినపిమ్మట అతనిని మళ్ళీ తనచల్లని చూపులతో బ్రతికించి ప్రాణిసృష్టికి భిక్ష పెట్టిందిగాబట్టి బ్రతుకమ్మ పేర నేడు పార్వతీదేవి కొలువబడుతుంది.

జగత్తులో పుష్పానికి ఫలానికి కారణకార్య సంబంధముంది. కనుక స్త్రీలు ఆదేవిని కారణరూపమైన పుష్పరాసిలో ఆవాహనచేసి కొలుస్తారు.

సృష్టికి మూలం ప్రకృతి. దాన్నే కొందరు శక్తి అనిగూడ అన్నారు. ఆ రెండు శబ్దాలు స్త్రీలింగాలు గాబట్టి దాన్ని సాకారోపాసకులు దేవిగా ఆరాధించినారు. దేవి స్త్రీగాబట్టి "బ్రతుకమ్మ" ప్రధానంగా స్త్రీలు కొలిచే దైవమయింది.

బ్రహ్మసృష్టి తొమ్మిదివిధాలు. అతడు శరదృతువులోని మొదటి తొమ్మిది దినాలలో ఒక్కొకసృష్టిని చేసి పదవనాడు విశ్రాంతి తీసికున్నాడట. చివరినాడు ఈ సృష్టి అంతా జలమగ్నమై పోతుంది. అందువల్ల స్త్రీలు మొదటి తొమ్మిది దినాలు బ్రతుకమ్మను పూజించి పదోనాడు ఆ దేవిని నీటిలో ఓలలాడిస్తారు.

ఒక్క బ్రతుకమ్మనేగాదు ఏ దేవతా మూర్తినైనా విసర్జన సమయంలో జలనిమజ్జనమే చేయవలెనని శాస్త్రాలు చెప్పుతవి. చివరినాడు మనుష్యులనుగూడ అంతేకదా! అస్తులు తీసికొనివెళ్ళి గంగలో కలుపుతారు.

మన పండుగలవెనుక ఇటువంటి రహస్యాలెన్నో ఇంకా గూడుకట్టుకొన్నవి.

తాతయ్య మాటలకు అడ్డుతగిలి గౌరి, మా పుస్తకంలో బ్రతుకమ్మ కథ ఇంకోతీరుగా వుందే! అన్నది.

ఏలాగున్నదో చెప్పవే విందాము అన్నది భూదేవమ్మ.

పూర్వం ఓ చోళరాజున్నాడు. ఆయనకు సంతానం కలుగలేదు. విష్ణుమూర్తిని గురించి తపస్సుచేసి వేయిమంది కుమారులు కలుగాలని వరం కోరుకున్నాడు. అతడు "తథాస్తు" అని అంతర్ధానమైనాడు. పిమ్మట రాజుగారికి వేయిమంది కలిగినారుగాని పెద్దవారైన పిమ్మట వారు యుద్ధాలకువెళ్ళి మరణించారు. ఈపర్యాయం రాజు మళ్ళీ తపస్సుచేసినాడు. విష్ణువు మళ్ళీ ప్రత్యక్షమై పురుషులైతే యుద్ధాలకు వెళ్ళి మరణించే ప్రమాదంఉందని ఈపర్యాయం ఒక కూతురు నిచ్చినాడు. తలిదండ్రి ఆ బిడ్డ చిరకాలం బ్రతకాలని "బ్రతుకమ్మ" అని పేరుపెట్టుకున్నారు. ఆమె పెరిగిన పిమ్మట విష్ణువే మళ్ళీ చక్రాంకుడు అనే పేరపుట్టి ఆమెను పెండ్లి చేసికొని వారికి అల్లుడైనాడు.

గౌరీ! నీవు చెప్పేది కథగాని నేనుచెప్పింది తత్వం అన్నాడు పరంధామయ్య.

విత్తనం నేలలో మొలకెత్తవలెనంటె నేల రుజువుగా పదునుగా ఉండవలె. అలాగే తత్వం వంటబట్టాలన్నా మానవులహృదయం రుజువై ఆర్ద్రమై ఉండవలె. అందుకొఱకు మహర్షులు తాము కనుగొన్న సత్యాన్ని శ్రోతల మనస్సుకెక్కించటానికి పురాణకథలు గ్రహించి వాటిని సరసంగా చెప్పి వినేవారి మనసుకరగించి, వాని మూలంగా తాము తెలుసుకొన్న ప్రకృతి సత్యాలను చెప్పినారు. అదీ కథల ప్రయోజనం. ఇక అవి సరసంగా చేసేఅందుకు వారు తమనాటి సంఘాన్ని ఆశ్రయించి, దానిలోని ఆచార వ్యవహారాలన్నీ అందులో ప్రవేశపెడతారు. అందువల్ల సాహిత్యం మనకు ప్రకృతి తత్వాన్నేగాక ఒకనాటి సాంఘిక జీవితాన్ని గూడ తెలుపుతుంది.

పరంధామయ్య మాటలకు అడ్డంవచ్చి భూదేవమ్మ! రాత్రి చాలా అయింవండి. ఇకపిల్లల్ని పండుకోనీయండి! ఉదయం చెప్పుకుందురుగాని మళ్ళీ అన్నది.

అవునల్లా! ఇకవెళ్ళి పండుకొండి! అని పరంధామయ్య ముక్తాయింపు పలికినాడు.

మరునాడు రాత్రికి కేశవుడు తాతయ్య దగ్గర ప్రస్తావనలో రాత్రి పురాణకథలలో వెనుకటి జీవితం కనిపిస్తుందన్నావుగదా! ఏలాగు? అని అడిగినాడు.

ఏలాగా ! దానికోసం మనం పురాణాలవరకుగూడ పోనక్కరేలేదు. ఉదాహరణానికి రాత్రి మనంవిన్న బ్రతుకమ్మపాటనే తీసుకొండి !

ఆమాట వినేవరకు పాట ఒక్కసారి వారి చెవుల్లో మారుమోగింది.

పూర్వం మనదేశంలో ''ఉప్పు''లేదు. అది సముద్రాలలో, కొండలలో, నేలలోగూడ దొరుకుతుందిగాని కొండల్లో అంతటాఉండదు. ఉప్పుకొండలిపుడు రాజస్థానంలో ఉన్నవి. అక్కడ వారు దాన్ని గనులనుండి త్రవ్వితీస్తారు. కాని దానికంటె సముద్ర లవణమే చౌక. అందుచేత వ్యాపారులు ఎక్కువగా దాన్నే తెస్తారు.

కోటారులనుండి ఉప్పుతేవటంలో పూర్వం లంబాడీలు ఘటికులు. వారు మహారాష్ట్రులు. ఉప్పువ్యాపారానికి అంకితంకావటం చేత వారిని మొదట లవణహారీలన్నారు. ఆపేరేక్రమంగా "లంబాడి" అయిందని శ్రీ సురవరంవారు చెప్పినారు.

పూర్వం వారు దాన్ని పెరికెలలో గోనెలలో పోసుకొని ఎద్దులమీద గుఱ్ఱాలమీద దేశంలోనికి తెచ్చి గింజలకు మార్చుకొనేవారు. పల్లెల వారంతా దానినే కొని నిలువ చేసికొనేవారు.

రాత్రి విన్నారుగా పాటలో ఉప్పు గోనెలు ఊరిలోనికి వచ్చినపుడు జనం దాన్ని కొనటానికి ఏవిధంగా ఆతురత పడేవారో.

తాతయ్యా ! అయితే ఉప్పును లంబాడీలు తేకుంటె పల్లెవారికి ఇక గత్యంతరంలేదా ! అని అడిగింది సందేహంగా.

ఎందుకులేదు ? అది నేలలో గూడనొరుకుతుందని చెప్పినానుగదా! బైబిలు ఉప్పును "భూముయొక్క సత్తా" అనిచెప్పింది. మహాపురుషులు అన్నిచోటులలో పుట్టనట్లు ఉప్పుగూడ నేలలోగూడ అంతటాపుట్టదు మరి. అదిపుట్టేచోట వానకాలం వెళ్లదలలో నేలపై తెల్లగా పూస్తుంది.

చాకలివాళ్లు "చౌడు" అనితెచ్చుకుంటారటగా ! అదేనా !

అదే నమ్మా! దాన్ని కనిపెట్టి "ఉప్పర్లు" అక్కడ మోకాలుబంటి, నడుముబంటిగా చిన్నచిన్న నూతులుతీస్తారు. అపుడు వానిలో నీరూరుతుంది. ఆనీటిని పైకితోడి ఎండిస్తే "ఉప్పు" అవుతుంది. అది చౌడునేలలో పుడుతుంది గాబట్టి దాన్ని "చౌటుప్పు" అంటారు. అది లేతగోధుమ రంగులో ఉంటుంది.

ఉప్పర్లు అంటె ఉప్పు తయారుచేసే వారేనామరి ! అన్నదిగౌరి. అంతేగదామరి ఉప్పు తయారుచేసేవాడు ఉప్పరి. దూదిని పింజలుచేసేవాడు పింజరి, దొమ్మి చేసేవాడు దొమ్మరి. ఇనుపకమ్మీలు చేసేవాడు కమ్మరి. పూర్వం ఇవన్నీ కులాలుగావు, వృత్తివాచకాలే.

తాతయ్యా! వేమనగారు "ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండు" అన్నాడుగదా ! నీవేమో ఉప్పు గోధుమరంగులో ఉంటుంది అంటావేంటి? అడిగినాడు కేశవుడు.

వేమనగారు చెప్పింది సముద్ర లవణాన్ని గురించిరా! దాన్ని పూర్వం "పండుప్పు" అనేవారు. లంబాడీలు దాన్నే తెచ్చేవారు. పల్లెలవారు కొని దాచుకొని దాన్ని పండుగపబ్బాలలో వాడుకొనేవారు. మామూలు దినాలలో "చౌటుప్పే" తినేవార్లు.

వేమనగారు తనమాటలో సంఘంతోపాటు తత్వాన్నిగూడ జోడించి చెబుతుంటాడురా!

తత్వమంటే ఏమిటి తాతయ్యా? అడిగినాడు కేశవుడు.
తత్వమంటే చెప్పే దానివెనుక వుండే అసలువిషయంరా!

అయితే వేమనగారందులో చెప్పిన తత్వమేమిటి? అన్నది గౌరి. ఉప్పు కప్పురం చూడటానికి రెండూ తెల్లని పలుకలుగానేవున్నా వాని "రుచులు" వేరంటాడు వేమనగారు. రుచి అంటె మన నాలుకకు తెలిసే రసమేగాదు. కంటికి కనిపించేకాంతిగూడ. ఇంకా అంతకంటె మనస్సుకు వుండే ఇష్టం అని ఇక్కడ చెప్పుకోవలె.

కర్పూరం దేవునిముందు వెలిగి తన కాంతిలో మనకాస్వామివారి ముఖారవింద దర్శనం చేయించి తాను అనంతమైనజ్యోతిలో లీనమై పోతుంది. ఇక ఉప్పేమో మన శాకపాకాలలో కలిసి వానికి రుచినిచ్చి మన పొట్టలోనికి పోయి విసర్జన మండలంద్వారా మళ్ళీ పుట్టినచోటికే చేరుతుంది.

మనుష్యులుగూడా అంతేరా! పైకి అందరూ ఒకేలాగు కనిపించినా పుణ్యాత్ములు కర్పూరంవలె వెలిగి భగవంతుని సన్నిధికి చేరుతారు. తక్కినవారు లౌకిక విషయాలతో పడి మళ్ళీ పుట్టవలసిన చోటుకే చేరుతారు. ఇది దానిలోని విషయం.

అమ్మో! ఈ పద్యంలో ఇంత అర్థంఉందా!- అని ఎదపై చేయివేసి అన్నది గౌరి.

వెనుకటికి మన ప్రాంతంలో ఉప్పు ఎక్కడెక్కడ తయారుచేసేవారు తాతయ్యా! అని అడిగినాడు కేశవుడు.

ఎక్కడో ఎందుకూ? ఇక్కడగూడ చేసేవారురా! అని చెప్పినాడు పరంధామయ్య.

ఇక్కడ అంటే ఈ ఊరిలోనేనా! నొక్కి అడిగినాడు వాడు.

అవునురా లేకుంటే దీనికి ఉప్పునూతల అని పేరెంచుకు వచ్చిందంటావు.

అయితే పూర్వం ఇక్కడ ఉప్పర్లే ఉండేవారా తాతయ్యా! అని అడిగింది గౌరి.

అవును. మొదలిక్కడ ఊరులేదు. ఇదొక పెద్ద లవణక్షేత్రం. ఇదంతా ఉప్పుబావులే వుండేవి. ఇక్కడ తయారయ్యేఉప్పు ఈ ప్రాంతానికంతా సరఫరాఅయ్యేది.

అమరాబాదు, సిద్ధాపురం, గోదలు, నూగూరు, ఆవంచ, ఇవన్నీ పూర్వం పరగణాలు, వీనిలో కొన్ని వనపర్తి, మరికొన్ని కొల్లాపురం ప్రభువుల పాలనలో వుండేవి. ఈ ప్రాంతానికి మరాఠా జిల్లాలనుండి లంబాడీలు, ఖమ్మం ప్రాంతంనుండి పెరికెవారు అనే సంచారవ్యాపారులు వచ్చి నిలిచిపోయినారు.

ఇక్కడి భూముల్లో జొన్నపంట ఎక్కువ.

ఇక్కడికి వ్యాపారానికి వచ్చిన పెరికెవారు లంబాడీలు ఒకరికొకరు సహాయంగా ఎక్కడికివెళ్ళినా కలిసేవెళ్ళేవారు. వారు పైపరగణాలకు వెళ్ళినపుడు తమసరుకుపై ఆ పరగణాపాలకులకు పెరికెకు లేదా బస్తాకు ఇంతఅని పన్ను కట్టవలసివుండేది. వారు ఆవిధంగా చెల్లించవలసిన పన్ను ఇద్దరు అంటె పెరికెలు లంబాడీలు కలిసి జాయింటుగా ఒకే కాగితంపై వ్రాసియిచ్చేవారు, లేదా వ్యాపార నిమిత్తం పరగణాలలో హక్కు వ్రాయించుకొనేవారు, ఆవిధంగా వారానాడు వ్రాసియిచ్చిన

కాగితాలు ఇప్పటికి ఇంకా వనపర్తి, కొల్లాపురం ప్రభువుల దస్త్రాలలో, ఇతరుల దస్త్రాలలోగూడ నిలిచియున్నవి.

ఈ పెరికె లంబాడీ, జాతులకంటే మొదలిక్కడ గోనెవారుండే వారు. వారు గోనెలతో వ్యాపారం చేసేవారు. రెడ్డి తెగకు చెందినవారు వారు.

తాతయ్యా! మన జిల్లాలో ఉప్పు ఇంకా ఎక్కడెక్కడ దొరుకుతుంది, అని అడిగినాడు కేశవుడు.

మన తాలూకాలో ఇదేగాక కురువమీదగూడా మరో ఉప్పునూతల ఉందిరా! అక్కడగూడ ఉప్పు చేసేవారు. జినుకుంట దగ్గర "ఉప్పరిపల్లె" అని మరో ఊరుంది. అక్కడగూడ ఉప్పుసిద్ధం చేసేవారు అని చెప్పినాడాయన.

## 9

మరునాడు దసరాపండుగ వచ్చింది.

జనమంతా సరదాగా పిండివంటలు చేసికొని తిని సాయంకాలం కొత్త బట్టలు వేసికొని మేళతాళాలతో జమ్మికి వెళ్ళినారు.

పరంధామయ్యగారి వెంట గౌరి కేశవుడుగూడ వెళ్ళినారు. ఊరి వెలుపల వుండే జమ్మిచెట్టు అప్పటికే సున్నము ఎఱ్ఱమన్నుతో అలంకరింపబడి వుంది.

ఆ చెట్టు దగ్గరకు వెళ్ళినపిమ్మట తాతయ్యవెంట వారుగూడ చెట్టు చుట్టూ ప్రదక్షిణంచేసి ఒకచోట కూర్చున్నారు.

తాతయ్య ఆ కాగితంపై ఏదేదో వ్రాసి చెట్టుదగ్గరవుండే పూజారి [illegible]

గౌరి కేశవులకు ఆ తతంగమంతా ఏమిటో అర్థంకాలేదుకాని ఊరందరూ కలిసి అక్కడికి రావటంమాత్రం సరదాగావుంది.

వారు ఆయనతో ఏ పండుగనాడు లేనిది ఈపండుగనాడు ఈ విధంగా ఊరివెలుపలికి వచ్చి జమ్మిచెట్టు నెందుకు పూజించాలి అని అడిగినారు.

అదేరా నేనుచెప్పినానుగా! ఒక్కొక్క పండుగవెనుక ఒక్కొక్క రహస్యముందని. ఇంక ఆ పండుగలుగూడ మనదేశంలో ఒక్కొక్కజాతికి ఒక్కొక్కటి చొప్పునవున్నవి.

పండుగలుకూడా జాతులనుబట్టి వున్నాయా అన్నాడు కేశవుడు.

అవునురా వున్నవి. జ్యేష్ఠమాసంలో వచ్చే పున్నమవుందే దానికి "ఏఱువాక" పున్నమ అనిపేరు. ఆనాడు రైతులు తమ పొలంపనులు ఆరంభిస్తారు కాబట్టి అది రైతులపండుగ. దాన్ని ఇక్ష్వాకుల కాలంలో "నాగండ్లపండుగ" అనికూడ అనేవారు. శ్రావణ మాసంలోని పున్నానికి "నూలుపున్నమ" అనిపేరు. అది కేవలం బ్రాహ్మణుల పండుగ. ఆనాడు వారు పాతజందం మార్చి క్రొత్తది వేసికుంటారు. వటువులకు 'ఉపాకర్మ' చేస్తారు.

అంతేగాక వ్యాసమహర్షిని పూజిస్తారు. ఆ కారణంగా దానికి జందాలపున్నమ లేదా వ్యాసపూర్ణిమ అనిపేరు.

ఇక భాద్రపదంలోవచ్చే వినాయకచవితి వుందే దాన్ని అందరు చేసినా పద్మశాలీలు, వైశ్యులు విశేషించి చేస్తారు కాబట్టి అది వారిపండుగ.

గడిచిపోయిన పెత్తరమావాస అలగాజాతికందరికీ పెద్దపండుగ. వారికి తమకుటుంబంలో చచ్చిపోయినవారి తేదీలు సరిగా జ్ఞాపకం వుండవు. కాబట్టి తద్దినం పెట్టేబదులు వారు తమపెద్దల కందరికీ ఈ అమావాస్యనాడు పెట్టుకుంటారు.

ఇక ఈ దసరా వుందిగదా ఇదేమో ముఖ్యంగా రాజులపండుగ. ఈ పండుగకు యుగయుగాల చరిత్రవుంది. త్రేతాయుగంలో శ్రీరాముడు రావణుని ఈనాడే చంపినాడట. అందువలన వారు దీన్ని "దశశిరహర" అన్నారు. అదే క్రమంగా "దసరా" గా మారిందట. ఇప్పటికి మన భారతరాజధానియైన ఢిల్లీలో దసరాముందు రామలీల మైదానంలో తొమ్మిది దినాలు రామాయణ ప్రదర్శన జరుగుతుంది. ఈనాడు పెద్ద రావణుని బొమ్మను చేసి కాలుస్తారు.

ద్వాపర యుగంలో పాండవులు అరణ్యవాసం చాలించి మారువేషాలతో విరాటరాజు కొలువులోనికి వెళ్ళేఅపుడు తమ ఆయుధాలన్నీ ఒక జమ్మిచెట్టుపైన దాచి వెళ్ళినారట. ఏడాదిముగిసే నాటికి విరాటరాజుపైకి దుర్యోధనుడు దండెత్తివచ్చి అతని ఆవులను తోలుకొని పోతుంటే అపుడు ఉత్తరుడు వానిని విడిపించుకొని రావటానికి వెళ్లినాడు. కాని కౌరవ సైన్యాన్ని చూచి భయపడగా అతనికి సారథిగాఉన్న అర్జునుడు తన రథాన్ని ఆయుధాలు దాచిన జమ్మిదగ్గరకు పోనిచ్చి దానిపై తాముదాచిన బాణాలుతీసికొని యుద్ధానికి వెళ్లి దుర్యోధనుని ఓడించి విరాటరాజుగారి ఆవులను రక్షించినాడు.

అపుడు కౌరవులు ఆవులను మలిపినవాడే అర్జునుడు అనిగుర్తు పట్టినారు గాని అతనినేమి చేయలేక పోయినారు. ఆనాటినుండి ఆవులను మలిపినవాడే అర్జునుడు అనేది మనకు ఒకసామెతగాగూడ నిలిచి పోయింది. దాన్ని వ్యక్తి సామర్థ్యాన్ని తెలిపేఅపుడు వాడుతారు.

సంవత్సరం గడిచినపిమ్మట మళ్లీ వారికి మహాభారత యుద్ధం వచ్చింది. అపుడు జమ్మిదగ్గరకు వెళ్లి వారుదానిపై దాచిన తమ ఆయుధాలు తీసుకొని వెళ్ళి యుద్ధంచేసినారు. చివరకు దానిలో అర్జునుడు గెలిచినాడు. అప్పటినుండి ఈపండుగ మనకు "విజయ దశమి" అయింది.

పాండవులు జమ్మిపై ఆయుధాలు దాచి దానిపై నుండి తీసికొని వెళ్ళి గెలిచినారు. కాబట్టి దానిపై అవి దాచటం వారికి అచ్చివచ్చింది. అందువల్ల గెలిచిన పిమ్మట వారాచెట్టును పూజించినారు. అచ్చివచ్చిన దాన్ని ఆరాధించటం మనలో ఈ విధంగా యుగాలనాటి నుండి ఉన్నది కాబట్టి అందుకే ఈనాడు మనం జమ్మిని పూజిస్తున్నాము.

ఒక్క పాండవులకు అచ్చివచ్చినందుకేగాక ఈ చెట్టుకు ఈనాడు మరోవిధంగాగూడ ప్రాధాన్యత ఉంది. దసరానాడు తప్పకుండా శ్రవణా నక్షత్రం ఉంటుంది. అది శ్రీమహావిష్ణువునకు సంబంధించిన నక్షత్రం. జమ్మిచెట్టు తిరుపతికొండలపై వెలసిన శ్రీనివాసుని కులదేవత. ఆ శ్రీనివాసుడుగూడ మరెవరోకాదు శ్రీమహావిష్ణువే. అందుచేత ఈనాడు నక్షత్రాన్ని దాని దైవాన్ని బట్టిగూడ జమ్మిని పూజించవలసి ఉంది.

అర్జునుడు జమ్మిపైనుండి ఆయుధాలు తీసికొనివెళ్ళి గెలిచినాడు కనుక పూర్వం రాజులుగూడ ఈనాడు తమ ఆయుధాలకు, వాహనాలకు అంటె గుఱ్ఱాలు మొదలైనవానికి పూజలుచేసి వానితో సీమోల్లంఘనం చేసి, అంటె పొలిమేరదాటి జమ్మిని పూజించి, అపరాజితా లతాకంకణం కట్టుకొని, గరుడదర్శనం చేసుకొని నమస్కరించి తమ దిగ్విజయయాత్రలారంభించేవారు.

అపరాజిత అంటె "విష్ణుక్రాంత మొక్క". దానిపూవు నీలంగా ఉంటుంది. కాబట్టి ఆ మొక్కను "విష్ణుకాంతి" అని పిలిచినారు. అదే ఈనాడు మనం విష్ణుకాంత అంటున్నాము. "విష్ణుకాంతను చూచినపుడు విడనాడిపోరాదు" అని సామెత. దానిపూవునో ఆకునో తీసికొని కన్నుల కద్దుకొని ధరించుకొని పోతె వెళ్ళినపని జయమవుతుందని పూర్వుల నమ్మకం.

గరుడదర్శనం గూడ అటువంటిదే. గరుత్మంతుడు అమృతం కొఱకు ఇంద్రునిపైకి యుద్ధానికి వెళ్ళి గెలిచినాడు కనుక ఈనాడు విజయ

యాత్రలు పెట్టుకునే రాజులకు గరుడదర్శనం చేసికొని నమస్కరించే ఆచారం ఏర్పడింది. అంతేగాక అతడు విష్ణుమూర్తి వాహనంగూడ కనుక ఏపనికి వెళ్ళేవారికైనా అతని దర్శనం శుభాన్ని కలుగజేస్తుంది. ఇట్లా ఈపండుగలో విష్ణుక్రాంతధారణం - గరుడదర్శనం గూడ ముడివేసుకొని ఉన్నవి.

మరి కాగితంపైన నీవేదో మంత్రం వ్రాసినావుగదా! అని అడిగింది గౌరి.

పరంధామయ్య తెలిక గానవ్వి అది మంత్రం కాదమ్మా! శమీప్రార్థన.

ఇంతవరకు ఇది రాజులపండుగ అన్నానుగదా! అలాగే దీనిపిమ్మట వచ్చే దీపావళి వ్యాపారుల పండుగ. ఆనాటినుండి వారు కొత్తలెక్కలు మొదలుపెట్టుకుంటారు.

ఇప్పుడు బ్యాంకు చెక్కులవలె పూర్వం "హుండీ" అనేపద్ధతి ఉండేది. వానిని గ్రామాధికారులుకాని, ధనవంతులుగాని, వ్రాసేవారు. హుండీపైన వ్రాసినవారి ముద్రఉంచెబాలు, దానిని ఎవరైనాసరే పట్టేవారు; అంటే అదితీసికొని దాన్ని తెచ్చినవారికి అందులో ఎన్ని రూపాయలు వ్రాసిఉంటే అన్ని యిచ్చేవారు. పిమ్మట దాన్ని వారు వ్రాసినవ్యక్తి తారసపడినపుడు అతనికిచ్చి తాము చెల్లించినడబ్బు వడ్డీతో తీసికునేవారు. పూర్వం అటువంటివి ఎక్కడెక్కడి హుండీలన్ని ఏటిపొడుగునా వ్యాపారులదగ్గరకు చేరుతుండేవి. వారు దీపావళినుండి కొత్తలెక్కలు మొదలుపెట్టుకుంటారు గాబట్టి ఈనాడు సీమోల్లఘనం చేసి జమ్మిని పూజించిన పిమ్మట దానిక్రిందనే కూర్చుని తమతమ పాతహుండీల లెక్కలన్ని ఎవరెవరిదగ్గరనుండి తమకు ఎంతెంత వెళ్ళవలెనో తేల్చుకొని మళ్ళీ కొత్తవానికి శ్రీకారం చుట్టుకొనేవారు కాబట్టి ఈనాడు ఆపద్ధతి అమలులో లేకున్నా జమ్మిక్రింద కూర్చుని హుండీవ్రాసే ఆచారం మాత్రం మిగిలిపోయింది. ఈనాటికీ మాత్రం "జమ్మిక్రిందివ్రాత" అని చెల్లనివ్రాతకు దృష్టాంతంగా చెప్పుకుంటున్నాం" అన్నాడు.

జమ్మి దగ్గరినుండి కదిలి వారు ముచ్చట్లు చెప్పుకొంటు గ్రామం లోనికి అడుగు పెట్టినారు.

గ్రామంలోనికి చేరగానే పరంధామయ్య పిల్లలను ఆలయం మీది నుండి తీసుకొని వచ్చినాడు.

ఆనాడు పండుగకాబట్టి పూజారి గుడిలోని దేవుని నిండుగా అలంక రించి అర్చించినాడు.

పరంధామయ్య లోపలికి వెళ్ళినాడు

పిల్లలు ఆయన వెనుక నడిచినారు.

వారంతా అర్ధమండపంలోనికి చేరుకున్నారు. గర్భాలయంలో దేవుని ప్రక్కగా నేతిదీపం నిండుగా నిశ్చలంగా వెలుగుతుంది. ఆ వెలుగులో పుష్పాలంకృతమైన స్వామిమూర్తి అనిర్వచనీయ సుందరంగా కనిపి స్తుంది.

పరంధామయ్య మంటపంనుండి వ్రేలాడుతున్న గంటను ముమ్మారు మ్రోగించినాడు. తరువాత గౌరిని కేశవుని చేతులతో ఎత్తిపట్టుకోగా వారు మ్రోగించినారు. దానిధ్వనులు ఓంకారానికి ఆమ్రేడితాలై ఆలయ మంతా నిండుకొన్నవి.

పూజారి భక్తుల కోసరమై గర్భమంటపం కడపదగ్గర ఒక పళ్ళె రంలో కుంకుమ ఉంచిటక దానిపై ఉంచినాడు.

గంట మ్రోగించిన పిమ్మట పరంధామయ్య పళ్ళెరంలోని కుంకుమ ఇంత తీసుకొని తాను పెట్టుకొని పిల్లలకుకూడ పెట్టి గర్భాలయం కడపను చేతులతో తాకి కన్నులకద్దుకున్నాడు. పిల్లలుగూడ దానికి దండంపెట్టినారు.

పూజారి పళ్ళెరంలో కానుకలు పెట్టేవారి గోత్రనామాలు చెబుతు స్వామివారికి హారతులిస్తున్నాడు.

పరంధామయ్య స్వామివారికి కుడివైపుగా నిలిచి కనులుమూసి చేతులు జోడించుకొని ప్రార్థించ సాగినాడు.

# కేదారేశ్వరస్తుతి

1. కల్యాణైక నికేతనం పురహరం కారుణ్య వారాన్నిధిం
రంగ త్తుంగ తరంగ గాంగలహరీ సద్మజ్జటా మండలం
వామాంకోజ్జ్వల దద్రిరాజతనయా శృంగార చేష్టాంచితం
కేదారేశ్వర ముప్పనూతల పురీ వాసం భజామ్యన్వహమ్.

2. సానందోభయ పార్శ్వ సంతతనటత్ భృంగ్యాదిభి స్సన్నుతం
భక్తత్రాణ పరాయణం భవహరం శాస్వత్ప్రభా భాసురం
చిద్రూపం హరిదంబరం సిత చితాభస్మానులేపోజ్వలం
కేదారేశ్వర ముప్పనూతల పురీవాసం భజామ్యన్వహమ్.

3. విశ్వసృష్టి విరించి ముఖ్యవిబుధై స్సంసేవ్యమానం సదా
విష్వక్సేన వినాయకార్చితపదం విద్యామయం విశ్వగం
విత్తేశస్య సుహృత్తమం విషధర గ్రైవేయకం శ్రీకరం
కేదారేశ్వర ముప్పనూతల పురీవాసం భజామ్యన్వహం.

4. క్రూరం మార మమేయ గంధభరితం ఫాలాగ్నినా భస్మసా
త్కుర్వాణాద్భయకంపితం త్రిభువనం యస్మాదభూ త్తం విభుం
ఆయుష్మా న్యముపాస్య ఘోరతపసా జాతోమృకండో స్సుతః
కేదారేశ్వర ముప్పనూతల పురీవాసం భజామ్యన్వహం.

5. యోగిస్వాంత సరోజ నిత్యవసతిం యోగప్రదానోద్యమం
ప్రాలేయాచలజా సుదుష్కరతప శ్చర్యాఫలం భోగదం
ప్రాకామ్యం సకలాను భూతిషు గతం దక్షాధ్వరారిం శివం
కేదారేశ్వర ముప్పనూతల పురీవాసం భజామ్యన్వహం.

కేదారేశ్వర నతిరియ, మతులా శ్రీ తెల్కాపల్లి కులజేన
శ్రీ రామచంద్ర కవినా రచితా భూయాచ్చిరం జగత్ప్రిథితా.

స్తోత్రానంతరం పరంధామయ్య ఆత్మప్రదక్షిణంచేసి సాష్టాంగపడి లేచినాడు.

గౌరి కేశవుడు అంతవరకు చేతులుకట్టుకొని నిశ్చలంగా ఆయనను చూస్తు అలాగే నిలబడిఉన్నారు.

పరంధామయ్య భక్తిమయ ప్రపంచంనుండి తెప్పరిల్లుకుంటు బయటికి నడిచివచ్చి అక్కడ ఒకతిన్నెపై కూర్చున్నాడు.

పిల్లలు ఆయనవెనుక అనుసరించినారు.

ఆయన ఇంకా సంపూర్ణంగా ధ్యానముద్రనులడి తేరుకోలేదు. అయినప్పటికీ కేశవుడాయన ముఖంచూస్తు మొదలిక్కడ అన్ని ఉప్పునూతులే ఉండేవి అన్నావుగదా! ఇక్కడ ఈదేవుని ఎవరు నిలిపినారు తాతయ్యా! అనిఅడిగినాడు.

ఇక్కడ ఈస్వామి తెచ్చినిలిపినవాడు కాదురా! అన్నాడాయన.

మరి! అని ప్రశ్నార్థకంగా చూసిందిగౌరి.

పరంధామయ్య ఎక్కడకూర్చుంటె అక్కడే ఒక రచ్చబండ. అంత వరకు అక్కడ కూర్చున్నవారంతా ఆయనదగ్గరగా జరిగి "ఏమో చెబుతున్నారు?" అని అడిగినారు.

పిల్లలు ఇక్కడ ఈస్వామిని ఎవరు నిలిపినారని అడుగుతున్నారు. ఏమోఅబ్బా! ఆసంగతి మేమెవరమూ వినలేదు అనివారంతా క్షణకాలం ఆలోచనలో పడి దిక్కులు చూచినారు.

కొంచెం దూరంలో "బెస్త ఆసెన్న" కూచుని ఉన్నాడు. అప్పుడు అక్కడ ఉన్నవారిలోకెల్లా వయసులో అతడే పెద్ద. అయినా మనిషిగట్టిగా ఉన్నాడు. కంటిచూపు తగ్గలేదు. ఎప్పుడూ ఏదో ఒకపని చేస్తూనే ఉంటాడు.

పరంధామయ్య "ఆసెన్నా" అని పిలిచినాడు.

అతడు లేచి దగ్గరగావచ్చి ఏంది అయ్యగోరు? అన్నాడు.

అలాకూర్చో నీవు వయస్సులో మాఅందరికంటె పెద్దవాడవుగదా! ఇక్కడ ఈదేవుని ఎవరునిలిపినారో విన్నావా? అని అడిగినాడు పరంధామయ్య.

నిలిపినవాడు కాదంట పుట్టినాడంట అన్నాడతడు నిలుచొనే.

"ఏ విధంగా పుట్టినాడు" అని అడిగినాడు కేశవుడు.

మాయమ్మ పేరు సత్తెమ్మ. ఆమె సెప్పంగయిన్నా ! ఎనకటికి ఇక్కడ ఊరులేదంట. కొసికంత దూరంలో నాగమ్మపల్లె అనే వూరు. అక్కడ జోగిరెడ్డి అనే ఓ గోనెకాపు ఉండెనట. ఆయన అవులు ఈ సుట్టు పట్ల వట్టుక మేస్తుండెనంట. అప్పుడిక్కడ ఓ పెద్ద పుట్టగూడా ఉండెనట. అయితె ఆ అవుల్లో ఓ నల్లావు నెలనెలా పున్నానికి పున్నానికి రాతిరేల ఆ పుట్ట దగ్గరికొచ్చి యిన్ని పాలుగురిసిపోయేదంట. ఆ సంగతి కనిపెట్టిన పసులకాడోల్లెవరో జోగిరెడ్డి గారికి సెబితె సూతావని ఆయన ఒ పున్నానికి కాపేసిందంట.

అది కార్తీకమాసం. ఎన్నెల బాగా పిండారబోసినట్లుగా ఉంటె ఆ ఎన్నెట్లో ఆవు గుతిగొన్నట్టు ఉరికొచ్చి ఆ పుట్టదగ్గర నిలిసిందంట. అపుడు దాని పొదుగులోనుంచి పుట్టమీన పాలవాన గురిసిందంట.

అది వినేవరకు పరంధామయ్య ఆనందం పట్టలేకపోయి విన్నావుతా కేశవా ! ఆ ఆవు ఎంత పుణ్యమయిందో ! కార్తీక పూర్ణిమ అంటే

సామాన్యంకాదు. ఆనాటి రాత్రి దేవతలు స్వయంగా కైలాసంనెళ్ళి శివుని దర్శించుకొని పూజిస్తారట. అందుచేత ఆనాటి రాత్రి రుద్రాభిషేకం చేస్తే గొప్ప పుణ్యం లభిస్తుంది.

అయితే ఆ ఆవు గూడ......అని గౌరి ఏదో అనబోయింది. పరంధామయ్య దాన్ని వినివించుకోలేదు. అందుకే పోతనగారు భారతదేశ జంతువుల భాగ్యములేమని చెప్పవచ్చు అని పొగిడినాడురా! ఈ దేశంలో జంతువు కావటమే ఎంతో పుణ్యమంటె ఇక మానవుడంటె సామాన్యమా!

కేశవా! నీవు విన్నావోలేదో గాని మనదేశంలో శనివారాలు ఉపవాసం పాటించిన శునకాలు, పురాణపఠనం జరిగే అపుడు దానిని విన్న పాములు, పక్షులు, ఆలయాలతో స్వామివారికి ప్రదక్షిణలు చేసే సర్పాలు ఉన్నవి.

తాతయ్యా! నీవు తరువాత చెబుదువుగాని ''ఆసెన్న''ను చెప్పనీయి అని విచారించినాడు కేశవుడు.

నిజమే! ఇక తరువాత ఏం జరిగిందో చెప్పు ఆసెన్నా అన్నాడు పరంధామయ్య.

ఆ ఆవుపాలు గురువటం సూసిం తరువాత జోగిరెడ్డి మర్నాడు ఆ పుట్టలో ఏవుందో సూతామని మనుసుల్ని తెచ్చి సుట్టు ఓ గజం వారు వెట్టి తవ్వించినాడంట. అపుడు పుట్ట న్యాలమట్టం అయినంక బగమూరెడు లోతునుండి దానిలో ఓ స్తంబం పుట్టుకొచ్చిందంట. అది ఎంతతవ్వినా అంతుతేలలేదంట. బాయిలో నీరూర నిండటం మొదలై తవ్వేవారికి యింకసాద్దెం కాలేదంట. అపుడది వారికి యిసిత్రం అనిపించి అక్కడ ఉప్పుబావులదగ్గిర ఉండేవోల్లను పిలిసి సూపిన్రంట. మర్నాడు

ఆ సంగతి పల్లెలకు తెలిసి వాల్లు వీల్లు వచ్చి సూసిపోతుంటె మీఅసుంటి వో పెద్దవనిసి వచిసూసి ఇది మావూలు స్తంబంగాదయ్యా. ''కేదారేశ్వర లింగం'' అని సెప్పిండంట. ఇంగ ఆనాటినుంచి సామికి పూజలు మొదలైనయంట- మాయమ్మ సెప్పేది అన్నాదతడు.

ఇపుడు గుడిలో ఉండేది ఆదేవుడేనా! అడిగింది గౌరి.

ఆ సావేనంట. ఆయన పుట్టిన సోట ఆలాగే కదులకుండ ఉన్నాడంట. ఆయినను ఆదారంగా సేసుకొనే ఈగుడి గట్టిన్రంట అన్నాదతడు.

పరంధామయ్య విషయం మళ్లీ అందుకొని, విన్నావాగౌరీ! ఈ దేవుడు తెచ్చి నిలిపినవాడుగాడు ''స్వయంభువు'' అన్నాడు నిశ్చలంగా.

అయితే ఇక యిక్కడ ఊరేవిధంగా ఏర్పడింది అన్నాడు కేశవు. అది వినగానే "అంతా వింటూనే కథ మళ్ళీ మొదటికి తెచ్చినావుపో'' అన్నాడు పరంధామయ్య.

అదివిని అక్కడ ఉన్నవారిలో మరొకవ్యక్తి ఈవిధంగా చెప్పినాడు: ''ఇదుగోసామీ! మొట్టమొదట ఇక్కడీ వూరులేదు. ఈ సుట్టు కనిపించే గుట్టలే ఉండేవి. ఆ తూర్పుదానికి ఎర్కలిగట్టు, దానిపక్కదానికి పోలిగుట్ట, అల్ల ఆ వుత్తరందానికి రాసగట్టు అనిపేర్లు ఇంక ఇక్కడ నేమో వుప్పు బావులుండేవి.

ఎనకటికి యిక్కడ బాచెసాని, కామసాని, నాగమ్మ, రంగమ్మ, సెన్నమదేవి అని పేరుపొందిన గొప్పింటి వాళ్లున్నారంట.

అవునట! మా తాతయ్య చెప్పాడు వారు ఊళ్లుగూడ కట్టించారటగా! అన్నదిగౌరి.

ఊర్లేగాదమ్మా! కుంటలుగూడ ఏయించిన్రు. రంగమ్మప్యాట ఇప్పుడుంది. నాగమ్మపల్లెగూడ ఉండేది. ఈ సుట్టుపట్లకల్లా అదే పెద్ద

పూరు. దానికి కాసింత దూరంలో బిచ్చెంరాజు, చెన్నంరాజు అనే యిద్ద రన్నదమ్ములుగూడ పల్లెలు గట్టించిన్రు.

చెన్నంరాజు చెన్నకేశవుని భక్తుడు గావట్టి తమ వూర్లో ఆ దేవునికి ఓ గుడి గట్టించి దేవుని పేర ఓ కుంటగూడ యేయించిండు. యిక్కడి వుప్పుబావులకు మొదలు ఆ చెన్నంరాజు పల్లెనే దగ్గిరగా ఉండేది కావట్టి ఇక్కడీ దేవుడు పుట్టిం తరువాత ఆ పల్లెనే యిక్కడికి జరిగిందని యెన కటి వోల్లనేవారు'' అని లేచినాడతడు.

కనుచీకటి పడింది కాబట్టి అక్కడి వారంతాలేచి యింటిదారు పట్టినారు.

# 11

చెన్నకేశవుడంటె ఎవరు తాతయ్యా! అని అడిగినాడు కేశవుడు.

ఉ. చిత్తముగూర్చి మాచెరల చెన్నడు శ్రీగిరి లింగమున్ కృపా
యత్తతజూడ ముల్కి విషయంబునకా మహిమంబు చెల్లెగాక!

అని శ్రీనాథమహాకవి ములికినాటికి మాచెర్ల చెన్నడు శ్రీగిరి లింగడు ముఖ్యదేవతలైనట్లు చెప్పినాడురా.

చెన్నకేశవునిది మాచెర్లనా? అడిగింది గౌరి.

అతని మొదటినివాసం అదిగూడా కాదమ్మా! కనకాద్రి. అతడు హైహయ వంశీయుల కులదైవం. ఆ వంశీయుడైన అనుగురాజును తర తరాలనుంటి ఒక బ్రహ్మహత్య వెన్నాడివచ్చేదట. అపుడతను దాన్ని పోగొట్టుకోదలచి జీడినూనె గుడ్డలు గట్టుకొని కులదైవాన్ని తీసికొని యాత్రలు చేస్తూ పలనాటికి గూడా వచ్చి చంద్రవంకలో స్నానంచేసినాడు. అపుడతడు కట్టుకున్న గుడ్డలు జీడిరంగు విడిచి చంద్రవంక చాయదేలినవి

ఆరాత్రి అతనికి స్వామి కలలో కనిపించి మనమిక యిక్కడ నుండి వెళ్ళవద్దు అన్నాడు.

అనుగురాజు ఆమాటలువిని తనవెంట తెచ్చుకొన్న స్వామిమూర్తిని ఒకచోట ప్రతిష్ఠించుకొని పూజిస్తూ కొన్ని దినాలకు ఆ స్వామి అనుగ్రహం చేత ఆ రాజ్యాన్ని సంపాదించుకున్నాడు. తరువాత ఈ అనుగురాజు నిలిపిన స్వామికే బ్రహ్మనాయుడు పెద్ద ఆలయం కట్టించినాడు. నీవు హనుమకొండలోని వేయిస్తంభాల మండపాన్ని గురించి విన్నావో లేదో ఆది అచ్చంగా అలాగే ఉంటుంది.

కేశవుడంటె విష్ణువుగదా! మరి చెన్నకేశవుడంటె విష్ణువేనా? అడిగింది గౌరి.

విష్ణువేనమ్మా! అతడు కృతయుగంలో తెల్లగా, త్రేతాయుగంలో పచ్చగా, ద్వాపరంలో ఎఱ్ఱగా, కలియుగంలో నల్లగా ఉంటాడు కాబట్టి చెన్నకేశవుడంటె ఎఱ్ఱని విష్ణువు అని తాత్పర్యం. చెన్నుడు అంటె అందమైనవాడు అనిగూడ అర్థం ఉంది గాబట్టి సుందరుడైన విష్ణువు అని గూడా అర్థం చెప్పవచ్చు. హిందూ తత్వం దేవుని ఒక్కొక్క రంగులో ఒక్కొక్క రూపంలో తలిస్తే ఒక్కొక్క ఫలితం కలుగుతుందని చెబుతుంది కాబట్టి ఈ మతంలో దేవునికి అనేకమైన నామరూపా లేర్పడినవి.

విష్ణువును నీలవర్ణునిగా, శివుని తెల్లని వానినిగా, బ్రహ్మను హిరణ్యగర్భునిగా, లక్ష్మిని ఎఱుపురంగుగలదానినిగా, సరస్వతిని పద్మకేసర వర్ణంగా భావింపవలె. గణపతిని పెద్దబొజ్జ గలవానినిగా, హనుమంతుని వానర్లునిగా తలచవలె ఈ విధంగా ఒక్కొక్క దేవతకు ఒక్కొక్క రంగు, ఒక్కొక్క రూపం ఏర్పాటైవుంది.

అంతేగాక ఒక్కడైన విష్ణువే మత్స్య, కూర్మ, వరాహ, నరసింహాది రూపాలలో ఉపాసింపబడి వేరువేరు ఫలితాల నిస్తాడు. ఒకతెల్లైన

ఉమాదేవియే లలిత, శ్యామల, కామాక్షి, కామేశ్వరి మొదలైన రూపాలలో ఉపాసింపబడి వేరువేరు ఫలితాల నిస్తుంది. ఇది మన దేవరహస్యం. దీన్ని అర్థం చేసుకో గలిగినపుడు మన ప్రతిమాపూజ యింద్రధనుస్సులోని వివిధ వర్ణాలవలె మనోహరమై భావిస్తుంది.

అది ఉండనీగాని ఈ చెన్నపదం ఉంటే అది పదమూడో శతాబ్దం నాటికే బాగా ప్రచారానికి వచ్చింది. మన ఉమామహేశ్వరంలో చెన్న మహేశ్వరం అనేస్థలం, చెన్నసోమనాథ, చెన్నరామనాథ అనే ప్రతిష్ఠలు గూడఉన్నవి.

ఇక మనం ప్రతిదినం సంధ్యావందన సమయంలో చెప్పుకొనే విష్ణువు పేర్లలో "కేశవ"అనే పేరే మొదటిది. అందుచేతనే వానికి కేశవ నామాలనిపేరు. శ్రీమన్నారాయణునికి నాలుగు చేతులలో ఉండే ఆయుధాలు మార్చిమార్చి ధరింప జేసినపుడు ఇరవైనాలుగు రూపాలేర్పడుతవి. అవే మనపూర్వులు కేశవ నామాలుగా ఏర్పరచినారు.

అయితే చెన్నకేశవుని మూర్తి యేవిధంగా ఏర్పడుతుంది? అని అడిగినాడు కేశవుడు.

విష్ణువుకి కుడిచేత చక్రం, ఎడమచేత శంఖం ఉండవలె. ఆవిధంగా గాక కుడిచేత శంఖం, ఎడమచేత చక్రం ధరిస్తే చెన్నకేశవుడంటారు. కన్నడు లీ రూపంగానే విష్ణువు నెక్కువగా ఆరాధించినారు.

"చెన్నుడు" అంటె సుందరుడు గాబట్టి పేరుకు తగినట్లు చెన్న కేశవాలయాలు గూడా పరమసుందరంగా ఉన్నవి. మైసూరు రాష్ట్రంలోని బేలూరు, గుంటూరు సీమలోని మాచెర్ల, మన తెలంగాణంలోని గంగాపుర చెన్నకేశ్వరాలయాలు పనితనానికి పేర్గు చెందినవి.

తాతయ్యా! మరి యిక్కడి పల్లెలోగూడా ఒక చెన్నకేశవాలయం ఉండేదన్నావుగదా! అన్నది గౌరి.

అవునమ్మా! ఆ పల్లె యిక్కడికి జరిగిన పిమ్మట ఆ ఆలయం దీనిలో కలిసిపోయింది.

అయితే ఆవూరిపేరు గూడా దీనిలోనే కలసిపోయిందా! అని అడిగింది గౌరి.

పరంధామయ్య చిన్నగా నవ్వి, లేదులే! దీనికి చెన్నమాతాజుపల్లె. లేదా కేదారేశ్వరపురం అని ఉండవలసిందిగాని యిక్కడ మొదట ఉప్పునూతు లుండటంవల్ల ఆ పేరే నిలిచి పోయింది.

మరిదీన్ని పల్లె అనిగాని పురమనిగాని, అనలేదేం? అన్నాడు కేశవుడు.

అనే ఉంటారుగాని రానురాను అది మాసిపోయి ఉంటుందిరా! ఆ విధంగా స్థలవాచకాలు లోపించి షష్ఠ్యంతంగా నిలిచిన గ్రామాలు గుండాల, వేముల, జిల్లెళ్ల అని మన ప్రాంతంలో చాలా ఉన్నవి అన్నాడు తాతయ్య.

## 12

కథ ముగించుకొని వారు ఆలయంనుండి లేచి యింటికి వచ్చే వరకు కనుచీకటి పడింది.

లోపలికివచ్చి గౌరి, కేశవుడు తాము తెచ్చిన శమీపత్రి బామ్మగారి చేతిలోపెట్టి పాదనమస్కారము చేసినారు.

ఆమె వారిని ఎత్తిదీవించి భర్తదగ్గరకు వచ్చి, ఏమండీ! ఇంతాలస్య మయింది? అని అడిగింది.

ఇంతవరకు మాటామాటా చెప్పుకుంటూ కేదారేశ్వరాలయం దగ్గరే కూర్చున్నామే! అన్నాడాయన.

ఆ సమాధానం విని గౌరి "కేదారేశ్వరుడంటె ఏ దేవుడు తాతయ్యా!" అని అడిగింది.

ఏ దేవు దేమిటి? ఈశ్వరుడే అన్నాడతడు.

అయితే కేదారేశ్వడని పేరెందుకు వచ్చింది? అని మళ్ళీ అడిగింది గౌరి.

అదా నీ సందేహం? "క" అంటె శిరస్సు, "దార" అంటె భార్య అని అర్థం కాబట్టి "కే శిరసిదారాః యస్య" అనే వ్యుత్పత్తినిబట్టి తలపై భార్యగలవాడు అని దాని అర్థం అన్నాడాయన.

ఈశ్వరుడు తలపై భార్యనెందుకు ధరించినాడు తాతయ్యా! అని అడిగినాడు కేశవుడు.

భార్య అంటె భార్యగాదురా! అని నవ్వినాడు ఆయన.

అబ్బా! పిల్లలు వారికేమి తెలుసండి. పురాణ విషయాలన్నీ విడమరిచి చెప్పండి అన్నది భూదేవమ్మ.

శా. ఆకాశంబున నుండి శంభుని శిరం బందుండి శీతాద్రి సు
శ్లోకంబైన హిమాద్రి నుండి భువి భూలోకంబు నందుండి, య
స్తోకాంబోధి పయోధి నుండి పవనాంధోలోకముం జేరె గం
గా కూలంకష— అనేపద్యం మీకెప్పుడైనా వచ్చిందిరా! అని అడిగినాడు పరంధామయ్య.

వచ్చింది అన్నారు యిద్దరు ముక్తసరిగా,

ఏమే గౌరీ! నీవు గంగావతరణం కథ ఎప్పుడూ వినలేదటే! అని అడిగింది భూదేవమ్మ.

లేదు అన్నది గౌరి.

అయితే నేచెబుతాను వినవే అని పిలిచి ప్రక్కగా కూర్చో బెట్టుకున్నదామె.

పరంధామయ్య వరేయ్ కేశవా! ఇక మీ బామ్మగారు చెప్పే కథ వినరా! అని విశ్రాంతిగా మంచంపై వాలినాడు.

కేశవుడు తాతయ్యను విడిచి బామ్మవైపు తిరిగినాడు. భూదేవమ్మ కథ మొదలు పెట్టింది.

పూర్వం సూర్యవంశంలో సగరుడు అనే చక్రవర్తి ఉన్నాడు. ఆయన నూరు యజ్ఞాలు చేయవలెనని తలపెట్టి తొంబది తొమ్మిది చేసినాడు. లోకంలో ఎవరైనా నూరు యజ్ఞాలు చేస్తె యింద్రుడౌతారు. అందువల్ల ఆకాలపు యింద్రుడు సగరుడు నూరోయజ్ఞం చేసేఅపుడు ఒక రాత్రి మాయా రూపంలోవచ్చి గుఱ్ఱాన్ని తీసికొనివెళ్లి పాతాళ లోకంలో కపిలమహాముని ఆశ్రమంలో కట్టివేసినాడు. తెల్లవారిన పిమ్మట సగరుని కొడుకులు గుఱ్ఱాన్ని వెదుకుతూ పాతాళంవరకు వెళ్లి అక్కడ కపిల మహర్షి ఆశ్రమంలో తమ గుఱ్ఱాన్ని చూసి ఆయనే దాన్ని పట్టుకొని తెచ్చి ఉంటాడని కోపంతో అతనిపైకి వెళ్లినారు.

అంతవరకు అక్కడ ఏమి జరిగింది కపిలునికి తెలియదు కాని అతడా కలకలానికి తపోభంగమై కోపంతో కన్నులు తెరిచినాడు.

కన్ను అగ్నితత్వం కాబట్టి తపస్సు చేసేఅపుడు వారిలోని అగ్ని శక్తిఅంతా కన్నులలో గూడు కట్టుకొని ఉంటుంది. అందువల్ల వారు కన్నులు తెరిచేటప్పుడు ఎదురుగా ఉండరాదు. వారికేగాదు పెద్దవారి

కెవరికైనా సరే వారిచూపుకు సూటిగా ఉండరాదు. కొంచెం ప్రక్కగా నిలువవలె సగరుని కుమారుల కది తెలియదు. అందువల్ల కోపంలో కను దెరచిన ఆ మహర్షి దృష్టి వారిపైబడి బూడిద కుప్పలై పోయినారు.

అయ్యో, పాపం! అన్నది గౌరి.

దేవతలు కోపించి చూస్తే ఆవిధంగా భస్మమౌతారట. మన్మథుడు అట్లాగే అయినాడని మా పాఠంలో వచ్చింది అన్నాడు కేశవుడు.

ఎందుకూ పతివ్రతామాహాత్మ్యంలో మాత్రంలేదా! తపస్సు చేసు కొనే కౌశికుడు చూస్తే కొంగ చచ్చిపడిందని అన్నదిగౌరి.

భూదేవమ్మ వారుచెప్పింది విని మళ్లీ ఆరంభించింది.

ఈ సగరపుత్రులు అరవైవేలు. వారిలో అందరికంటె పెద్దవాని పేరు అసమంజసుడు. వాడు నిజంగా పేరుకు తగినట్లుగానే లోకానికి సరి పడకుండా నడిచేవాడు. అదిచూచి తండ్రి వానిని రాజ్యంనుండి వెళ్ల గొట్టినాడు. అతడు వెళ్లిపోయి ఎక్కడనో ఒక చిన్నరాజ్యం సంపాదించు కొని బ్రతుకుతున్నాడు.

లోకంలో మంచివారికి దుష్టులు పుడితె దుష్టులకు మంచివారుకూడ పుడుతుంటారు. కాబట్టి అతడు దుష్టుడై తండ్రిచే వెళ్లగొట్టబడినందున కపిలుని దృష్టికి తప్పిపోయినాడు. తరువాత అతనిచేత అవంశానికి ఒక గొప్ప మేలు జరిగింది.

ఏమిటది? అన్నాడు కేశవుడు.

అతని వంశంలోనే ఆతరువాత భగీరథుడు అనే మహానుభావుడు పుట్టినాడు. పెద్దవాడైన పిమ్మట అతనికి కపిలుని కోపానికి బూడిద యైన తమ తాతల సంగతి తెలిసింది. వారికే విధంగా నైనా ఉత్తమగతి

కలిగించవలె ననుకొన్నాడు. మరణించినవారి అస్తులు గంగలో కలిపితె వారికి ఉత్తమగతి కలుగుతుంది కాని అప్పటికి భూలోకంలో గంగ లేదు.

పోనీ తమతాతల అస్తులైనా అక్కడికి తీసికొని వెళ్లటానికి అవి గుట్టలుగా పడిఉన్నవి. అందువల్ల ఆ బూడిదరాసుల పైనుండే గంగను పారించవలె ననే సంకల్పం కలిగి ఆమెను గురించి తపస్సు చేసినాడు.

గంగ ప్రత్యక్షమై నేను దూకితె భూదేవి భరించలేదు గాబట్టి నన్ను భరించేవారి నెవరినైనా చూడుమని చెప్పింది. భగీరథు దదివిని బ్రహ్మను గురించి తపస్సు చేసినాడు.

బ్రహ్మ అతని తపస్సునకు మెచ్చి ప్రత్యక్షమై శివుడైతె గంగను భరించగలడు కాబట్టి అతనిని ప్రసన్నుని చేసికొమ్మని చెప్పినాడు.

భగీరథునికి విసుగులేదు. అతడు బ్రహ్మను విడిచి శివునిగురించి తప మారంభించినాడు. శివుడతని దీక్షకు మెచ్చి ప్రత్యక్షమై కోరికను తెలుసుకొని విశ్వరూపం ధరించి నిలిచి గంగాదేవిని యిక తన తలపైకి దూకుమన్నాడు.

ఆమె మహావేగంతో శివుని తలపైకి దూకి, అతని జడముడిలోనికే చాలక సుడులు తిరిగిపోయింది. తరువాత భగీరథుడు ప్రార్థించగా అతడు తనజడలోని ఒక పాయను సడలించి గంగయొక్క ఒక పాయను హిమాలయంపైకి వదలినాడు. అక్కడినుండి భగీరథు డామెను పాతాళం వరకు కొనివెళ్లతుండగా దారిలో జహ్నుమహాముని ఆశ్రమం వచ్చింది. అపుడా మహర్షి యజ్ఞంలో ఉన్నాడు కాని దారిలో ఉండటం చేత గంగ దాన్ని ముంచివేసింది. అపుడా మహర్షికి కోపంవచ్చి ఆ ప్రవాహాన్నంతా ఆపోశనం పట్టినాడు.

భగీరథునికి మళ్లీ కష్టం ఎదురయ్యింది. జహ్ను మహర్షిని గంగను విడువుమని ప్రార్థించినాడు. అపుడా మహర్షి అతని ప్రయత్నాన్ని హర్షించి

గంగను తన కుడిచెవినుండి వెలుపలికి విడిచినాడు. అందుచేత గంగకు ఇప్పటికీ "జాహ్నవి" అనే పేరు నిలిచిఉంది.

భగీరథు డామెనా విధంగా జహ్ను మహర్షినుండి విడిపించుకొని పాతాళానికి గొనివెళ్లి తమ పితరుల భస్మరాశిపై నుండి పారించి వారికి ముక్తిని కలిగించినాడు.

భగీరథుడా విధంగా ఎన్ని కష్టాలు కలిగినా తన పట్టు విడువలేదు గాబట్టి పట్టువిడువని ప్రయత్నాన్ని యిపుడు "భగీరథ ప్రయత్న" మంటారు.

కేశవు డదివిని బామ్మా! గంగావతరణం చెప్పినావుగాని ఆమె శివునికి భార్య ఏలాగయింది చెప్పినావు కాదు- అన్నాడు.

భూదేవమ్మగారు, అది మళ్లీ మీ తాతగారే చెప్పవలెరా! అన్నది. కేశవుడు పరంధామయ్య వైపు తిరిగి, తాతయ్యా! మరి గంగ శివుని కేవిధంగా భార్య అయింది? అని అడిగినాడు.

కేశవా! శబ్దశాస్త్ర ప్రకారం దేనినైనాసరే భరించేవాడు భర్త, భరింపబడేది భార్య అవుతుంది. ఆకారణంగానే రాజులు భూభర్తలైనారు. ఈ సంప్రదాయాన్ని తీసికొని పురాణాలు తరువాత కాలంలో గంగను శివునికి భార్యగా రూపొందించినవి. దాన్ని ఆయాకాలాల కవులు స్వీయ ముద్రవేసి రిజిస్టరు గూడ చేసినారు. అట్టి వారిలో చెప్పదగినవాడు చేమకూర వెంకన్న. అతడు విజయ విలాసంలో-

శా. తాసైరింప కపర్ది యుండగ భవద్గర్భంబునం దాల్చి తే
జోసహ్యున్ శరజన్ము గాంచి యల నీహారక్షమా భృత్కుమా
రీ సాపత్న్యము గన్న మోహపు పురంధ్రీ రత్నమౌ దీవె కా
వే! సర్వజ్ఞుడు నిన్ను నేల తలపై నెక్కించుకో జాహ్నవీ.

అని అర్జునుని చేత గంగానుతి చేయించినాడు.

పార్వతి శివుని పెండ్లి చేసికోవటానికి ఆకులైనా తినకుండ తపస్సు చేసింది పాపం! అందువల్ల ఆమెకు "అపర్ణ" అని పేరు. ఆమె అపర్ణ కనుక తేజోమూర్తియైన కుమారుని ఏవిధంగా గర్భంలో ధరిస్తుంది? అందువలన అటువంటి కుమారుని నీవు కని శివునికి ముద్దుల యిల్లాలి వైనావు గాబట్టి అతడు నిన్ను తలపై నెక్కించుకున్నాడంటె ఎందు కెక్కించుకోడు? అని గంగాదేవి విషయమై ఒక అద్భుతమైన కల్పన చేసినాడు.

తరువాత ఈ కల్పనను చాలామంది వాడుకున్నారు. చివరకు సినిమావారు గూడ వాడుకున్నారురా! గౌరమ్మా!"నీ మొగు డెవరమ్మా!" అనే పాట వినే ఉంటావుగదా!

నెత్తిన ఎవతెనో ఎత్తుకొని నిత్తెంగా ఊరేగునట.
అదియే ఆతని ఆలియట-అని అందులో ఉందిరా!

ఉందిగాని తాతయ్యా! దానిలోనే-

ఎవరో పిలిస్తె వచ్చింది. ఎవరికోసమో పోతుంది.
మధ్యన మజిలీ చేసింది.
సగం దేహమై నేనుంటె అది పెండ్లామంటె చెల్లదులే!

అనిగూడా ఉందిగదా! అన్నది గౌరి.

అయితే గంగ శివునికి భార్యగదా! తాతయ్యా! మరి! అన్నాడు కేశవుడు.

రామాయణ మంతా విని రాముడు సీతకేమి గావలెనని అడుగు తావేమిరా! యింకా గంగావతరణాన్ని కవులా విధంగా ఉత్ప్రేక్షించి నారు గాని నిజంగానే శివుడు చిన్నభార్యను నెత్తినెక్కించుకున్నాడను కునేవురోయి. పెండ్లాన్ని యెపుడు నెత్తినెక్కించుకోగూడదు సుమా! అన్నాడతడు.

అదివిని భూదేవమ్మగారు, పొండి! మీరంతా మరీ విడ్డూరం. పసిపిల్లలకు లేనిపోనివన్ని ఎరుక పరుస్తుంటారు అనుకొంటు లేచింది.

గౌరి, కేశవుడు తాతయ్య మాటలు నెమరువేసికుంటు నిద్రకు వెళ్లినారు.

# 13

మరునాడు గౌరి కేశవునితో ఈనాడు మనదేశంలో కేదారేశ్వరాలయాలు ఇంకా ఎక్కడెక్కడున్నాయో అడిగి తెలుసుకుందాము అన్నది.

వద్దు! ఇంతవరకు మొదలుపెట్టిన కథ ఇంకా వదిసిపోనేలేదు. అది అయిపోని! ఆ తరువాత కొత్తది చెప్పించుకోవచ్చు అన్నాడు కేశవుడు. ఇద్దరు ప్రొద్దునే పరంధామయ్యగారి దగ్గరకు వెళ్లినారు కాని అక్కడికి వెళ్లేవరకు వారి ఆశ నిరాశగా మారింది.

ఈనాడు ఆయన దగ్గరకు మాటాడటానికి ఎవరో ఒక క్రొత్తవ్యక్తి వచ్చినాడు.

ఆయన అంత ఎత్తుగాగాని లావుగాగాని లేదు. ఒక మోస్తరుగా ఉన్నాడు. తెల్లనిపంచె, కండువా మరియు చొక్కాతో నిరాడంబరంగా కనిపిస్తున్నాడు. చేతిలో ఒక చిన్న సంచి దానిలో మందులపెట్టె వంటిది ఏదో ఉంది.

వారు వచ్చేవరకే ఆయన ఏదో చెప్తున్నాడు. నేనీయేడు బదరి కేదారి యాత్రలు చేసివచ్చినానండి. అవి పార్వతీదేవి పుట్టినిల్లయిన హిమాలయంలో ఉన్నవి. ఆ రెండు క్షేత్రాలు హిమవంతుడు తనను దర్శించటానికి వచ్చే శైవ వైష్ణవుల కొఱకు తొడలపై పెట్టుకొని కూర్చున్న పుణ్య పేటికలు. మనదంతా భోగభూమి సుమండీ! ఇక్క

దన్నీ హోటళ్లు, సినిమాలు, ఫ్యాన్సీషాపు లుంటవి కాని అదంతా దేవ భూమి ఎక్కడ చూసినా పుణ్య నదులు, పర్వతాలు, ఆలయాలు, ఆశ్ర మాలే కనిపిస్తవి. హిమాలయం భారతమాతకు కిరీటం గాబట్టి దానిలోని యాత్రలన్నీ ఒక్కొక్కటి ఆ కిరీటంలో ఒక్కొక్క రత్నం.

శివుని కైలాసం, కుబేరుని అలకాపట్టణం దానిమీదనే ఉన్నవి. కేదారనాథం పాండవులు మహాప్రస్థానం చేసిన దారిలోనే ఉంది.

అది యిపుడే రాష్ట్రములో ఉంది? అడిగినాడు పరంధామయ్య. నేపాలులో నండీ! శివునికి ప్రియమైన రుద్రాక్ష లాదేశంలోనే పండుతవి. విష్ణు స్వరూపాలైన సాలగ్రామా లాదేశంలోనే పుట్టుతవి. ఇప్పటి వరకు మన సంస్కృతిని గూడా ఆ దేశమే రక్షిస్తుంది సుమండీ.

హిమాలయ యాత్రకు హరిద్వారం ఒక ద్వారం. పాండవులు అది దాటి చాలా దూరం వెళ్ళిన పిమ్మట వారిని పరీక్షించటానికి శివుడు ఒక ఐదలపోతు రూపంలో దారికి అడ్డం వచ్చినాడట. అపుడు భీముడు గద తీసికొని తరుముతు దాని వెనుక పరుగెత్తినాడు. అది మాయా కురంగంవలె అతనికి కనిపించి కనిపించకుండా పరుగెత్తింది. అపుడత నికి రుద్రనాథంలో దీని ముఖం, కేదారనాథంలో ముంగాళ్ళపై వంగి నేలను కుమ్ముతున్న దానివెన్ను. మధ్య మహేశ్వరంలో నాభి, తుంగ నాథంలో ముంగాళ్లు. కపిలేశ్వరంలో జడలు కనిపించినవట. ఆ తరువాత అదియిక కనిపించలేదు. అపుడు భీముడది శివుని మాయగా తెలిసికున్నాడు. ఇపుడాయా క్షేత్రాలలో ఉండే శివలింగాలు భీమునికి కనిపించిన మహిషాం గాల రూపంలోనే ఉంటవి. వాటిని పంచకేదారాలని పిలుస్తారు. ఇపుడు మనం ప్రసిద్ధంగా చెప్పుకునేది వానిలో రెండవది. అది మందాకినీ నదీ తీరంలో ఉంది. అక్కడ ఆ నదిలో అయిదు చిన్న చిన్న నదులు కలు స్తవి కాబట్టి దాన్ని పంచనదీ సంగమం అని కూడా అంటారు.

ఈ దారి అంతా పైకి ఎక్కటం అది శ్రమకరంగా ఉన్నా ప్రదేశం సుందరంగా ఉంటుంది. కేదారనాథుడున్న కొండవెనికి నుండే పాండవులు ద్రౌపదీ దేవితోగూడ మహాప్రస్థానానికి నడిచి వెళ్ళినారట. వారి అడుగుజాడ లిప్పటికీ అక్కడివారు యాత్రికులకు చూపుతుంటారు.

ఇపుడు మనం ఇల్లు విడువం. కాలంతీరి యమదూతలు వచ్చి ప్రాణాలు పెకలిస్తున్నా వారితో పోరాడుతుంటాము కాని పురాణ యుగం నాడు అలాగాదు. జీవితంలో తమ ఉద్దేశం నెరవేరిన పిమ్మట స్వేచ్ఛా మరణాన్ని కోరి ఏ పుణ్య నదీతీరాలకో, పుణ్య పర్వతాలకో, పుణ్య వనాలకో వెళ్ళి అక్కడనే ప్రాణత్యాగం చేసేవారు. ఆ విధంగా వెళ్ళటానికి ''మహాప్రస్థానం'' అని పేరు సుమండీ!

మన తెలుగు కవులలో శ్రీనాథుడు ఆ విధంగా మహాప్రస్థానం చేసినాడట. శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారు చెప్పినారు.

పాండవుల ప్రస్థానయాత్ర కేదారనాథంనుండే మొదలయింది. కాబట్టి యిపుడక్కడ ఆలయంలో కుంతి మరియు పాండవుల విగ్రహా లున్నవి.

మహాప్రస్థానం చేసినవారికి ఉత్తమగతి దొరుకుతుంది కనుక పిమ్మట వారికి కలిగిన సుగతిని వ్యాసమహర్షి దివ్యదృష్టితో చూచి లోకానికి చెప్పినాడు.

కేదారనాథుడు జ్యోతిర్లింగాలలో ఒకడు కాబట్టి ప్రజ లక్కడికి జ్యోతి దర్శనానికి వెళ్ళుతారు. అయాత్ర వైశాఖ మాసంలో జరుగుతుంది. శీతాకాలం ఆరునెలలు ఆలయం మూసి ఉంటుంది. పూజారు లక్కడినుండి వచ్చే అపుడు పట్టుతో కుట్టిన ఒక పొడుగాటి తిత్తిలో నేయినింపి దానికొక మూతి నమర్చి వత్తిని దూర్చి వెలిగించి స్వామి సన్నిధిలో ఉంచి, తలు

పులు మూసివస్తారు. వారు మళ్ళీ వెళ్ళేనాటికి ఆ జ్యోతి నిశ్చలంగా వెలుగు తూనే ఉంటుంది. ఆలయం తెరిచిన పిమ్మట పూజారి దాన్ని జాగ్రతగా తెచ్చి వెలుపల ఉంచి అందరూ జ్యోతి దర్శనం చేసికొన్న తరువాత ఆ తి త్తిని చించి దానిలో మిగిలిన నేతిని ప్రసాదంలో కలిపి అందరికి పంచు తాడు. దాన్ని వారు భ క్తితో యిండ్లకు తీసికొని వెళ్లుతారు.

ఇపుడు గుడిదగ్గర చిన్న ఊరేర్పడింది. పోస్టాఫీసు, హాస్పిట లున్నవిగాని రాత్రివేళ చలి ఎక్కువ గాబట్టి అక్కడెవరూ ఉండరు. చీకటి పడేవేళకు దానికి మూడు మైళ్లుండే "రాంబారా చట్టీ" కి చేరుకుంటారు.

గౌరి కేశవుడు క్రొ త్త వ్య క్తి చెప్పేవిషయం కొంత అర్థమై అర్థం గాక వింతగా వింటు నిలిచినారు.

పరంధామయ్య వారిని చూసి ఏమిరా ! ఆ విధంగా వింటూ నిలిచి నారు. కూర్చొని వినండి !

పోయి సేవింప లేకున్న పుణ్యతీర్థ
మహిమ వినుటయె సకల కల్మష హరంబు

అని పెద్దలంటారు. కాబట్టి యాత్రలు మనం స్వయంగా చేయలేకున్నా వాని మహాత్మ్యమైనా వింటె చాలు— అన్నాడు.

పరంధామయ్య మాటతో వారికి ధైర్యం వచ్చింది. చనువుగా ఇక అక్కడ కూర్చున్నారు.

# 14

పరంధామయ్య ఆయనతో కేదారనాథానికి ప్రయాణం సౌకర్యా లేమైనా ఉన్నవా లేకుంటె నడిచే వెళ్లవలసి ఉంటుందా? దారిలో వనం ఇంకా ఏమేమి చూస్తామో ! చెప్పండి అని అడిగినాడు.

ప్రయాణ సౌకర్యాలంటె సుమండీ! అని ఆయన మళ్లీ ఆరంభించినాడు.

మనకిపుడు హరిద్వారంవరకు ఏలాగూ రైళ్లు, బస్సులు ఉన్నవి. అక్కడినుండి "జోషీమఠం" బస్సు ఎక్కి దారిలో రుద్రప్రయాగ దగ్గర దిగి నడువవలసి ఉంటుంది.

అక్కడ వంతెనపైనుండి "అలకనంద"ను దాటి తీరంవెంట ఐదు మైళ్లు నడిస్తె "ఛలీలే" అనే ఊరు వస్తుంది. అది దాటగానే "సూర్య ప్రయాగ" ఉంది. అక్కడ సూర్యుడు తపస్సుచేసెనట. మందాకినిలో అక్కడ "అలసతరంగిణీ" అనే నదికూడ కలుస్తుంది.

ఛతేలీనుండి తొమ్మిదిమైళ్లు వెళ్లితె "అగస్త్యమున్యాశ్రమం" వస్తుంది. అక్కడ ఆ మహర్షి తపస్సుచేసినట్లు చెబుతారు. దానికి తూర్పున ఆరుమైళ్లపై స్కందపర్వతం, దానిపై కార్తికేయాలయం ఉన్నవి. కుమారస్వామి మన తెలుగువారికిగూడ ఇలువేలుపే.

అగస్త్యాశ్రమానికి అరమైలు దూరంలో "ఛోటానారాయణ్" అనే స్థలంఉంది. అక్కడ నారాయణమందిరం, దానిఎదురుగా ఒకరుద్రాక్ష వృక్షంగూడ ఉంది.

రుద్రాక్షచెట్టు ఏలా ఉంటుందండీ! అడిగింది గౌరి.

అది పెద్ద చెట్టే అమ్మాయ్! ఆకులు వంటరిగానే బల్లెం ఆకారంగా ఉంటవి. లేతకొమ్మల సందునుండి సన్నని పసుపుపచ్చ రోమాలు పుట్టుతవి. దాని పూవు తెల్లగా, పండు రేగుపండువలె ఉండి పుల్లగా ఉంటుంది. అక్కడివారు ఆ పండ్లతో పులుసుగూడ చేసికొంటారట.

ఛోటానారాయణ్ నుండి రెండుమైళ్లువెళ్లితె "చంద్రాపురి" వస్తుంది. అక్కడ మందాకినితో "చంద్ర" అనే నది కలుస్తుంది. అక్కడ శివ, మరియు దుర్గాలయాలున్నవి.

చంద్రాపురినుండి రెండున్నర మైళ్ల దూరంలో "భీరీ" అనేచోట మందాకినిని దాటవలసి ఉంటుంది. అక్కడ పాండవ భీముని గుడి ఉంది. అక్కడినుండి టెహరీకి వృద్ధకేదారానికి కాలిబాటలున్నవి. అక్కడికి ఆరు మైళ్లపైన "గుప్తకాశి" ఉంది. పూర్వం కాశినుండి ఏకాంతంకోరి వెళ్లిన మహర్షు లక్కడతపస్సుచేసిరట. అందువలన దానికాపేరు ఏర్పడిందట. ఇప్పుడదొక పట్టణం. అక్కడ ధర్మశాలలు హాస్పిటలు ఉన్నవి. ఆ కాశికి ప్రక్కనే బలిచక్రవర్తి కుమారుడైన బాణాసురుని శోణపురంఉంది. అక్కడ మందాకినికి ఆవలి తీరంలో "ఉషామఠం" ఉంది. బాణాసురుని కూతురు ఉషాదేవి పూర్వం అక్కడనే ఉండెనని, చిత్రరేఖ తన మాయచేత అనిరుద్ధుని అక్కడికే తెచ్చెనని అక్కడి వారంటారు.

అక్కడ విశ్వనాథ, అర్ధనారీశ్వరాలయాలున్నవి. మొదటిదానిలో కాశీ విశ్వనాథ లింగము, రెండవ దానిలో అర్ధనారీశ్వరమూర్తి ఉన్నవి. అది నంది నెక్కి మిక్కిలి సుందరంగా ఉంటుంది. ఆవిగాక అక్కడ పంచ ముఖ కేదారనాథాలయం ఉంది. దానిశిఖరం మిక్కిలి ఎత్తయి బంగారు కలశంతో అలంకరింపబడి ఉంటుంది. దానిఎదురుగా ఓంకారేశ్వర మందిరం అందులో కేదారనాథుని బంగారు ఉత్సవమూర్తి ఉంది.ఆ స్వామి సింహాసనంపైననే అష్టలోహాలతో చేసిన పార్వతీ తుంగనాథ ప్రతిమలు, అర్ధనారీశ్వరుడైన నటరాజు, కాళికాదేవి, చతుర్భుజ నారాయణ మూర్తు లున్నవి. అవిగాక ఆలయంలో స్ఫటికంతో చేసిన ఓంకారేశ్వర, బదరీ నాథ, కేదారనాథ, ఉష, అనిరుద్ధ, మాంధాత, మరియు కృత, త్రేత, ద్వాపర యుగపురుషుల ప్రతిమలున్నవి.

శీతాకాలంలో బదరీ కేదారనాథ క్షేత్రాలు మంచుతో కప్పబడి ఉన్నపుడు అక్కడి ఉత్సవ మూర్తుల నీ ఆలయంలోనే ఉంచి పూజి స్తుంటారు.

అక్కడ మహానందివలె రెండు గుండాలున్నవి. ఒకదానిలో రెండు ధారలు పడుతుంటవి. వానిని గంగా యమున లంటారు. యాత్రి కులా గుండాలలో స్నానంచేసి గుప్తదానాలు చేస్తారు.

ఉషామఠం యాత్రనేగాక ఇపుడు కాశివలె అదిగూడ ఒక పట్టణం. అక్కడ ఇందోరు, గ్వాలియర్ మహారాజులు పెద్దపెద్ద సత్రాలు కట్టించి నారు. సరుకుల దుకాణాలు, ఫ్యాన్సీషాపులు, పోస్టాఫీసు మొదలైనవన్నీ ఉన్నవి. అక్కడికి కేదారనాథం పప్పయి ఒక్క మైలుంటుంది. అక్కడి నుండి నేరుగా కేదారనాథం వెళ్లవచ్చు గాని దారి కఠినం.

గుప్తకాశి ఇపుడీ పట్టణం ప్రక్కన ఉంది. అక్కడికి రెండున్నర మైళ్ల దూరంలో "నలక్షేత్రం" ఉంది. నలచక్రవర్తి అక్కడ లలితా దేవిని గొలిచెనట. ఆ దేవి ఆలయం ఇపుడక్కడ ఉంది. దానికి మరో రెండున్నర మైళ్లపై "మాతాదేవి క్షేత్రం" ఉంది. అక్కడ దేవీ మందిరంతో పాటు మరో నలువదైదు ప్రాచీన మందిరాలున్నవి. మాతా క్షేత్రానికి మైలుపైన "నారాయణకోట" అనే స్థలం ఉంది. అక్కడ ప్రాచీనమైన నారాయణాలయం ఉంది. దానికి రెండు మైళ్లపైన సరస్వతీ నదీ తీరంలో ఒక కాళికాదేవి మఠం ఉంది. కాళిదాసు అక్కడనే ఉండి కాళికాదేవిని కొలిచెనట. అక్కడినుండి మరొక రెండు మైళ్లు వెళ్లితె "మౌఖండా" అనే స్థలం వస్తుంది. అక్కడ మహిషమర్దనీ దేవి ఆలయం ఉంది. అక్కడికి రామాపురం అయిదు మైళ్లు ఉంటుంది. అది ఆ దారిలో మరొక పెద్ద మజిలీ.

యాత్రికులు రామాపురం నుండి గూడా నేరుగా కేదారనాథం వెళ్ల వచ్చు. కాని కొందరు "త్రియుగ నారాయణం" మొదలైనవి చూస్తు వెళతారు. అంతేగాక వారు తమ ఎక్కువ సామానంతా అక్కడనే ఉంచి "కాలీకమలీవాలా" సత్రం నుండి అయిదు దినాల కొఱకు గొంగళ్ళు తీసి కొని పోతారు.

త్రియుగ నారాయణం అక్కడికి నాలుగుమైళ్లు. అక్కడ గంగో త్తరి, యమునోత్తరి దారులు కలుస్తవి. గంగోత్తరి, యమునోత్తరి అంటె ఆ నదులునేలకు దిగే చోటులు. మనం గంగాదేవిని "నారాయణపద సంజాతా" అని స్మరిస్తాము. బదరీనాథంపై నర నారాయణ పర్వ తాలనే రెండు పర్వతాలున్నవి. వానిలో నారాయణ పర్వతపాదం నుండే భాగీరథియొక్క హిమప్రవాహం పుడుతుంది. అక్కడ పుట్టి మెల్లగా పారుతు చతుస్తంభ శిఖరంపైనుండి, మానవ సుమేరు ప్రక్కనుండి శివ లింగ శిఖరంపైకి చేరి, అక్కడినుండి గోముఖంలో ప్రవేశించి గంగా రూపంలో నేలకు దిగుతుంది.

అయితే గంగ నారాయణ పాదంలోపుట్టి శివుని శిఖనుండి దూకటం పురాణాల లోనేగాక పృథ్విలోగూడ నిజమేనన్నమాట.

అవునండి. అందుకే నన్నయగారు "ఏరుల జన్మంబు ఎరుగనగునే" అన్నారు. ఏ నది ఎక్కడ పుట్టి ఏవిధంగా భూమికి వచ్చిందో నిజమెరిగి దాన్ని ఆధ్యాత్మిక దృక్పథంతో మేళవించి చెప్పిన మహర్షుల దివ్యదృష్టిని ఎంత కొనియాడగలం!

ఆ గంగోత్తరి యమునోత్తరి దారులు కలిసేచోట ప్రక్కగా ఉండే గుట్టపై ఒక నారాయణాలయం ఉంది. దానిలో స్వామికిరువైపుల శ్రీ భూదేవులుందురు. అక్కడ సరస్వతీ నది గూడా ఉంది. దానిలో బ్రహ్మ, రుద్ర, విష్ణు, సరస్వతీ గుండాలున్నవి. యాత్రికులు రుద్రగుండంలో

స్నానం, విష్ణు గుండంలో మార్జనం, బ్రహ్మ గుండంలో ఆచమనం చేస్తారు.

ఆ ప్రదేశం శివ పార్వతుల వివాహ స్థలమని చెబుతారు సుమండీ. అక్కడొక సతతాగ్ని కుండం ఉంది. అది శివ పార్వతుల పెండ్లి నాటిదట. యాత్రికులు దానిలో హవనంవేసి విబూది తీసుకుంటారు.

రామాపురం నుండి ఇక్కడికి వచ్చేఅపుడు సుమారు ఒకటిన్నర మైలు తరువాత "పాటాగాడ్" అనే వంతెన వస్తుంది. అక్కడి నుండి గూడ యాత్రికులు సోమప్రయాగ మరియు గౌరీగుండంమీదుగా కేదార నాథానికి వెళ్ళవచ్చు.

త్రియుగ నారాయణం వెళ్ళేవారికి రెండుమైళ్ళు ఎక్కిన పిమ్మట దారిలో శాకంబరీదేవి ఆలయం వస్తుంది. దాన్ని మానసాదేవి ఆలయం అని గూడ అంటారు. "శాకంబరి" పార్వతీదేవియొక్క ఆరవ అవతారం. అపుడామె ఒక గొప్ప కరువు రాగా మహర్షులందరినీ శాకదానం చేత రక్షించిందట యాత్రికు లాదేవిని దర్శనం చేసుకుని దేవికి వస్త్రా లర్పించి వెనుకకుతిరిగి మళ్ళీ పాటాగడ్ వంతెనకు వచ్చి సోమప్రయాగకు వెళ్ళుతారు. అక్కడ మందాకినిలో "సోమా" నది కలుస్తుంది. ఆ నదిని వంతెనపైనుండి దాటి ఒక మైలు వెళ్లిన పిమ్మట ఛిన్నమస్తక గణపతి ఆలయం వస్తుంది. పార్వతీదేవి స్నానం చేసే అపుడు నలుగు పిండితో చేసి ప్రాణం పోసి కాపలా ఉంచిన బొమ్మను శివుడక్కడనే తల నరికెనట. అక్కడికి మూడు మైళ్లపై "గౌరీ కుండం" ఉంది. అక్కడొక ఉష్ణగుండం, ఒక శీతగుండం ఉన్నవి. శీత గుండానికి అమృత కుండమని పేరు. గౌరీదేవి మొదట దానిలోనే స్నానం జేసెనట. రెండవదానికి గౌరీ కుండమని పేరు, అందలి నీరు ఛాలినంత వేడిగా ఉంటుంది.

అసలు పార్వతీదేవి అక్కడనే పుట్టినదట సుమండి. అందువల్ల అక్కడొక పార్వతీదేవి ఆలయం గూడ ఉంది. కేదారనాథం అక్కడికి ఎనిమిది మైళ్లు. కష్టిగా ఎక్కవలసి ఉంటుంది. దారిలో చలి మరియు ఈగలబాధ ఎక్కువ. అవి మనిషిని మెసలకుండా కరుస్తుంటవి. ఆ దారిలో ఒకమైలు వెళ్లిన పిమ్మట "చీరపట" భైరవాలయం వస్తుంది. భైరవు డెక్కడైనా దిగంబరుడు గాని అక్కడ అలాగాదు. యాత్రికులా దేవునికి వస్త్రాలు సమర్పిస్తారు. అది దాటిన పిమ్మట ఒక మైలుపై భీమశిల వస్తుంది. దానిని దాటి రెండుమైళ్లు వెళ్లితె "రాంబాడా" అనే స్థలం ఉంది. అదే ఇక కేదారనాథానికి చివరి మజిలి. యాత్రికులు మరునాడు ప్రొద్దున్నే లేచి తమ సామానంత అక్కడనేఉంచి కేదారనాథానికి వెళ్లి స్వామి దర్శనం చేసుకొని తిరిగి రాత్రివరకు మళ్లీ అక్కడికి వస్తారు. ఇదండీ! కేదారనాథానికి దారి అని ముగించి నాడాయన.

ఓహో! దారిలో ఎన్ని క్షేత్రాలున్నవి. కైలాసానికి వెళ్లే నాటికి కావలసిన దేవ దర్శనాలన్నీ దారిలోనే జరుగుతా యన్నట్టుగా ఉందే! అన్నాడు పరంధామయ్య అదివిని.

నేనన్నాను గదా సుమండీ. మొదలే! అది దేవభూమి అని. ఎక్కడ చూచినా క్షేత్రాలే క్షేత్రాలు, ఆలయాలే ఆలయాలు.

గౌరి, కేశవుడు ఆయనవైపు గౌరవంగా చూస్తు ఇవన్నీ మీరు చూశారా! అని అడిగినారు.

చూసినానమ్మా! నేను మూడు నెలలు ఆ ప్రాంతంలోనే గడిపినాను అన్నాడాయన.

అయితే ఇక కేదారనాథం ప్రత్యేకత ఏమిటో వివరించండి అని అడిగినారు వారు.

# 15

కేదారనాథం నిరంతరం మంచుతో కప్పబడిన కొండపై ఉందమ్మా! అది సముద్ర మట్టానికి 11,500 అడుగుల ఎత్తు ఉంటుందట. దానిపై కృతయుగంలో ఉపమన్యుడు, ద్వాపరంలో పాండవులు, కలి యుగంలో ఆదిశంకరులు శివుని గురించి తపస్సు చేసినారట.

అక్కడి శివలింగం స్వాయంభువం అనగా స్వతఃగా పుట్టిందిగాని ఒకరు మలిచి నిలిపినదిగాదు. అది ఎనిమిది గజాల పొడవు, నాలుగు గజాల వెడల్పు, నాలుగు గజాల ఎత్తుగలిగి నల్లగా నిగనిగలాడుతు వెనక కాళ్లపై నిలిచి ముంగాళ్లతో మోకరిల్లిన ఎనుబోతు వీపువలె ఉంటుంది. నేను మొదట పంచకేదారాలని చెప్పినానుగదా! వానిలో ఇది రెండవది. అంతేగాక అన్నిటిలోనికి ప్రసిద్ధిగూడా దీనికే ఉంది. భారత దేశంలో ఉండే పన్నెండు జ్యోతిర్లింగాలలో ఇది తొమ్మిదవదిగా చెబుతారు.

జ్యోతిర్లింగాలంటే ఏమిటండి ? అని అడిగినాడు కేశవుడు. జ్యోతిర్లింగాలంటే తేజోవంతమైన వని అర్థం బాబూ! ఇప్పటి మన పరిశోధకులు వీటిని గురించి ఇవి పురాణ కాలంనాటి అణు విద్యుత్కేంద్రాలుగావచ్చునని అభిప్రాయపడుతున్నారు. ఇపుడు మన దేశంలో బొంబాయి సమీపాన ఉండే ''ట్రాంబే'' లోని భాభా అణు పరిశోధనా కేంద్రంలో మొదట గట్టిన ''అప్సర'' అనే ''రియాక్టరు'' గూడ ఒక పెద్ద లింగాకారంగానే ఉంది సుమండి !

కేదారనాథంలో ఇపుడుండే ఆలయం ఆదిశంకరుడే అక్కడ తపం చేసికొనే కాలంలో కట్టించి నాడంటారు. అది అతిప్రాచీనమై నిరాడంబరంగా ఉంది. ఆలయం వెలుపల అమృత కుండం. ఈశానకుండం హంస కుండం, రేతసకుండం అనే గుండాలున్నవి.

ఆలయంలో కేదారనాథునితో పాటు ఉషానిరుద్ధుల మూర్తులు, పాండవుల ప్రతిమలు, శ్రీకృష్ణుని విగ్రహం, శివపార్వతుల మూర్తులున్నవి. ఆ ఆలయానికి రావల్‌సాహెబులు అధికారులుగా ఉన్నారు కాని వారు తమ గుమాస్తాలతో పూజ చేయిస్తుంటారు. ఆ పూజారులు జంగాలు. అక్కడ ఉదయం ఎనమిది గంటలవరకు స్థానికులకు, ఎనిమిదినుండి రెండువరకు యాత్రికులకు స్వామివారి దర్శనానికి ఏర్పాట్లున్నవి. రెండునుండి నాలుగువరకు స్వామికి అర్చన మరియు ప్రత్యేక హారతి జరుగుతుంది.

మనవైపేమో కమలాలు సరస్సులలోనే ఉంటవికాని అక్కడ ఆ కొండపై స్థల కమలాలున్నవి. యాత్రికులు వానిని తీసుకువెళ్లి స్వామిని పూజిస్తారు. అర్చన చేయించదలచిన వారితో పూజారి స్వామివారికి ఘృతాభిషేకం చేయిస్తాడు. నీళ్లతో చేయరు.

అంటె ఏమిటి? అని అడిగింది గౌరి.

ఘృతం అంటె నెయ్యి. అక్కడ నెయ్యి మిక్కిలి శ్రేష్టంగా ఉంటుంది. పూజారి అర్చించేవారి చేతిలో ఇంత నెయ్యి పోస్తాడు. దానిని వారు స్వామివారి శరీరానికి పూయవలసి ఉంటుంది. అక్కడ యిదొక క్రొత్తపద్ధతి.

అది ఆదేశాచారం కావచ్చు. అన్నాడు పరంధామయ్య.

తాతయ్యా! అది జ్యోతిర్లింగం అన్నారు గదా, అందుచేతనే నేయితో అభిషేకం చేస్తారేమో! జ్యోతి ఉద్దీపనకు నేయియే అవసరం గదా ! - అన్నాడు కేశవుడు.

బాగా ఊహించినావు బాబూ ! అన్నాడాయన.

అక్కడ ఇంకా ఏమైనా చూడదగినవి ఉన్నాయండీ! అని అడిగింది గౌరి.

ఉన్నాయమ్మా! మద్రగంగ, క్షీరగంగ, వాసుకీతాల్, గుగూకుండ్ అనే గుండాలు, భైరవశిల అనే ప్రదేశాలు చూడదగినవి. అన్నిటికంటె ముఖ్యంగా మనం శంకరాచార్యులవారి సమాధి చూడవలె. ఆయన అక్కడనే ఆలయానికి రెండు పర్లాంగుల దూరంలో మందాకినీ తీరాన సిద్ధి పొందినాడు. అతని సమాధి యిపుడక్కడ ఉంది.

మీరు మొదట పంచకేదారాలు అన్నారు గదా! మరి తక్కినవి ఎక్కడెక్కడ? ఉన్నవి అని అడిగినాడు పరంధామయ్య.

అవా! ఇపుడు మనం సర్వసామాన్యంగా చెప్పుకునే కేదారనాథ మేమో రెండవది. అది అన్నిటిలోకి వెన్నుపూస. ఇక మొదటిది రుద్ర నాథంలో ఉంది. అక్కడ ఉండే శివలింగం ఎనుము తలవలె ఉంటుంది. దాన్నిపుడు పశుపతి నాథమనిగూడ అంటారు.

మూడో కేదారం ఉషామఠానికి పన్నెండు మైళ్ళు ఉంటుంది. దాన్ని మధ్యకేదారం అనిగూడా అంటారు. అక్కడ భీమునికి మహిషం యొక్క నాభి కనిపించిందట కాబట్టి అక్కడి శివలింగం మహిషనాభివలె ఉంటుంది. ఇక నాలుగోకేదారం తుంగనాథంపై ఉంది.

అది మరో యాత్రనా! అడిగినాడు కేశవుడు.

అవును అక్కడికి గూడా ఉషా మఠంనుండే వెళ్లుతారు. ఆ దారిలో మంచుకొండల నడుమ కాళీమఠం ఉంది. అక్కడ మహాకాళీ, మహాలక్ష్మీ, మహా సరస్వతి మందిరాలున్నవి. దాన్ని సిద్ధపీఠమని చెబుతారు. "రక్త బీజుడు" అనే రాక్షసుని సంహరించటానికి దేవతలందరూ దుర్గాదేవిని అక్కడనే ఆరాధించినారట. వారికాదేవి అక్కడనే ప్రత్యక్ష మయిందట. దానికి మూడు మైళ్ళ దూరంలో "కాళీశిల" ఉంది. అక్కడి గుడిలో అరవైనాలుగు వేరువేరు యంత్రాలున్నవి. వాటిని రక్తబీజుని సంహరించే

అందుకు దేవతలు వేసిరట. అపుడు వానినుండి పుట్టినశక్తి దుర్గాదేవిని చేరి దానిచేత ఆమె వానిని చంపెనట.

కాశీమఠానికి రెండు మైళ్ల దూరంలో లోకేశ్వరీ ఆలయం ఉన్నది. యాత్రికు లక్కడికి వెళ్ళి పితృతర్పణాలు చేస్తారు.

ఉషామఠం నుండి బయలుదేరి మూడున్నరమైళ్లు నడిస్తే గణేశ్ చట్టి, అక్కడినుండి మరో అయిదుమైళ్లు వెళ్లితే పోథీబాసా, అక్కడి నుండి ఐదు మైళ్లపైన "బనియాకుండ్" అనే స్థలాలు వస్తవి. "బనియాకుండ్" దగ్గర పెద్దనగారు మనుచరిత్రలో చెప్పినట్లు పగలే చీకటి క్రమ్మె దట్టమైన అడవి ఉంది. అది దాటి ఒకమైలు వెళ్ళిన పిమ్మట "చౌపతా" అనే ప్రదేశం వస్తుంది. అక్కడికి తుంగనాథం మూడుమైళ్ళు ఉంటుంది. కస్తిగా ఎక్కవలసి ఉంటుంది.

ఒకవేళ ఎక్కలేకపోతే— సందేహం కలిగింది గౌరికి.

"అటువంటి వారికి గుఱ్ఱా లుండవచ్చు !" అన్నాడు కేశవుడు.

అక్కడ గుఱ్ఱాలు వెళ్ళవు బాబూ ! మనుష్యులే వెడతారు. అయితే నడువలేని వారిని ఎత్తుకొని పోయే అందుకు అడ్డాల దగ్గర కూలీలుంటారు. వారిదగ్గర తొట్టివంటి చిక్కం ఉంటుంది. వారు మనల్ని, మన సామానుని తక్కెడలో పెట్టి తూకంవేసి దానిలో పెట్టుకొని మోసుకుపోతారు. అందులకు సేరుకు ఇంత అని లెక్క ఉంటుంది. మన బరువును బట్టి దార్జిషడుతుంది.

మనిషిని చిక్కంలో ఏలా మోసుకు వెడతారు? అని అడిగింది గౌరి.

మనం దానిలో కాళ్ళు బయటికివేసి కూర్చోవలె. అతడు దాన్ని ఎత్తి తలకు తగిలించు కుంటాడు. అపుడు మన వీపు అతని వీపుకు ఆని చక్కగా కుర్చీలో కూర్చున్నట్టుగా అమరుతుంది.

ఒక్క మనిషిని ఒక్క మనిషి మోస్తాడా ! అన్నది గౌరి.

వాళ్ళుమనకంటె చాలా బలంగా ఉంటారమ్మా! పరంధామయ్యగారూ! మనం పురాణాలలో శివుని పట్టణం, కుబేరుని పట్టణం అక్కడే ఉండేవని చదువుతాం గదండీ ! శివుని సేవకులు పిశాచులు, కుబేరుని సేవకులు గుహ్యకులు గదా ! ఇప్పటికీ అక్కడివారివి పిశాచ ఘటాలే సుమండీ ! ఒక్కొక్కడు నూరుసేర్ల బరువు అవలీలగా మోయగలడు.

అయితే ఆనాడు కుబేరుడు కొండలలో వారిమీదనే సంచరించే వాడేమో ! అందుచేతనే అతనిని నరవాహను డన్నారు! అన్నాడు పరంధామయ్య.

తుంగనాథ శిఖరం ఎంత ఎత్తుంటుంది? అడిగినాడు కేశవుడు. సముద్రమట్టానికి పదమూడువేల అడుగులుంటుందట. మనం చేసే హిమాలయ యాత్రలో అన్నిటి కంటే అదే ఎత్తు. అందుకే దాన్ని తుంగనాథ మన్నారు. వాతావరణంలో మేఘాలు లేకుంటే పైకి ఎక్కిన పిమ్మట దుర్భిణితో చూస్తే మన ఢిల్లీ కలకత్తా బొంబాయి పట్టణాలు, అటు గౌరీశంకర శిఖరాల వరుసలో నందదేవి, పంచాచూలి, గంధమాదనం, ధవళగిరి, కేదారనాథం, గంగోత్తరి శిఖరాలు కనిపిస్తవట. కాబట్టి తుంగనాథ యాత్రికులు పైకెక్కిన పిమ్మట ఒక విశ్వరూప దర్శనం చేయవచ్చు.

అక్కడి ఆలయంలో గల శివలింగమూర్తి ఎనుము ముంగాలు రూపంలో ఉంటుంది.

ఐదో కేదారాన్ని కల్పేశ్వరం అంటారు. అక్కడికి జ్యోతిర్మఠం నుండి వెళ్ళవలె. ఆ మఠానికది ఏడు మైళ్ళుంటుంది. అక్కడి శివలింగ మూర్తి మహిష జటారూపంలో ఉంటుంది.

అది వింటున్న గౌరి, తాతయ్యా ! అయితే మన దిక్కు గూడ ఐదు కేదారాల్లయా లున్నవా అని అడిగింది.

అయితున్నట్టులేదు కాని వెనకటికి కారువంగ, పాపకల్లు, ఆవంచ గ్రామాలలోగూడ కేదారేశ్వరా లయాలుండేవట. అవి యెక్కడున్నా గర్భాలయం గోయిగా ఉండటం ఒక విశేషం.

ఇపుడు కారువంగలో గర్భాలయం ఇరుకుగా ఉండి దిగరాకుండా ఉన్నందువల్ల దాన్ని పూడ్చి నేలమట్టంచేసి పైని మరో లింగప్రతిష్ఠ జేసినారు. పాపకల్లులో నేమో దుండగులు స్వామిని పెకలించి వేసినారు.

పాపకల్లు ఆలయం పనితనంలో గంగాపురం చెన్నకేశవాలయంవలె ఉంటుంది. గంగాపురాలయం జక్కణాచార్యుని వంశీయులు కట్టినారట. ఇక ప్రాచీనానికి వస్తే దానికంటె కారువంగది పూర్వానిది అనవచ్చు.

మరి మన ఊరిది అని అడిగిందామె.

పరంధామయ్యగారూ! ఇక నేను వస్తాను అని లేచినాడు కొత్త వ్యక్తి.

కూర్చొండి! మా గ్రామంలోని ఆలయాన్ని గురించి వినిపోదురు గాని-మీరన్ని వినిపించినారుగదా! అన్నాడాయన.

ఆయన కూర్చున్నాడు.

గౌరీ! మన ఊరి ఆలయంగూడ ప్రాచీన మయిందే నమ్మా! మన ఊరిలో ఈ ఆలయం కట్టిననాటికి ఉమామహేశ్వరంలో ఇప్పటి ఆలయం లేదు! అన్నాడాయన ఆలోచనగా.

అయితే యిక్కడ దీన్నెవరు కట్టించినారు తాతయ్యా! అన్నాడు కేశవుడు.

తెలంగాణాన్ని పాలించిన వారిలో పశ్చిమ చాళుక్యులు ముఖ్యులు. దుందుభీ తీరంవెంట గంగాపురం ఆవంచ వారికి రాజధానగరాలుగా ఉన్నవి. పశ్చిమ చాళుక్యులలో ఆరవ విక్రమాదిత్యుడు బాగా ప్రసిద్ధుడు. అతని

సామంతుడుగా ఈ ప్రాంతాన్ని తొండరస చోళుడు పాలించినాడు. అతని కొడుకు కొండయ చోళుడు. అతనికి ఉదయనచోడ, నల్లభీమచోడ, గోకర్ణ చోడులనే కుమారులున్నారు. వారి శాసనాలు మన ప్రాంతంలో ఉన్నవి.

నల్లభీమ చోడుని భార్య ధెన్నమహాదేవి. ఆమె తల్లివారి గ్రామం మన తాలూకాలోని గట్టుతుమ్మెన. అక్కడి రామలింగేశ్వరస్వామికి ఆమె దీపదానం, మామిళ్ళపల్లి నృసింహ స్వామికి భూదానం చేసింది. ఆమె కొడుకు పిల్ల బచ్చెనాయకుడు మన ప్రాంతాన్ని ఏలినాడు

భీమచోడుని అన్నయైన ఉదయనచోడుని కుమారుడు సోమనాథ చోడుడు మన గ్రామంలోని కేదారేశ్వర స్వామికి ఒక భూదానం చేసినాడు. కాబట్టి దీన్ని ఇంచు మించు ఆ వంశీయులే కట్టించి ఉంటారు.

ఒక్క ఇదేఏమిటి సుమండి! మన ప్రాంతంలోని ఆలయాలన్నీ వాళే కట్టించి ఉంటారు అన్నాడు కొత్త ఆయన.

# 16

పరంధామయ్యగారి దగ్గరకు మాటాడటానికి వచ్చిన వ్యక్తి వెళ్ళిన పిమ్మట కేశవుడు "మన ఊరిలోని గుడిని చోళులెందుకు కట్టించినారు!" అని అడిగినాడు.

వారి స్వామికి భక్తులని కేదారేశ్వరుని కథవల్ల తెలుస్తుందిరా!

అయితే ఆ కథచెప్పు తాతయ్యా! అన్నది గౌరి.

పూర్వం ఉజ్జయినిలో ఓ సెట్టిగారికి పుణ్యవతి, భాగ్యవతి అని యిద్దరు బిడ్డలున్నారు. వారు తండ్రి ఆజ్ఞ తీసికొని ఒకనాడు ఒక నదీ తీరంలో ఒక మఱ్ఱిచెట్టుక్రింద కేదారేశ్వర వ్రతం చేసినారు. అప్పుడు శివుడు వారి భక్తికిమెచ్చి ప్రత్యక్షమై, ఆ కన్యలకు చక్కని రూపం, మరియు

భోగభాగ్యాలు కలిగే వరం యిచ్చినాడు. ఆ వరప్రభావంచేత కొంత కాలానికి పుణ్యవతిని ఒక ఉజ్జయినీ రాకుమారుడు, భాగ్యవతిని మరొక చోళరాజు చేసికున్నారు.

మహారాణి అయిన తరువాత భాగ్యవతికి గర్వం కలిగి కేదారేశ్వర వ్రతాన్ని లెక్కచేయలేదు. ఆ దోషంచేత ఆమెకు ఒక కుమారుడు కలిగిన తరువాత భర్త విడిచిపెట్టినాడు. పాపం! భాగ్యవతి అడవులపాలై ఒక బోయవాని యింట తలదాచుకొన్నది. ఆమె కుమారుడు అక్కడనే పెద్ద వాడైనాడు. అపుడామె ఒకనాడు కొడుకును దగ్గరకు పిలుచుకొని తన అక్కగారి విషయంచెప్పి ఆమె దగ్గరకు వెళ్లి కొంత ధనం యిప్పించుకు రమ్మని పంపింది.

అతడు పెద్దమ్మగారి దగ్గరకువచ్చి తమ తల్లి పంపిన విషయం చెప్పగా, ఆమె జాలిపడి కోరిన ధనం యిచ్చి పంపింది. కాని, ఆ పిల్లవాడు దానిని తెస్తుండగా దారిలో దొంగ లతనిపైబడి దోచుకున్నారు. అపుడతడు వట్టిచేతులతో తల్లిదగ్గరకు వెళ్ళలేక మళ్ళీ పెద్దమ్మ దగ్గరకే పోయినాడు. ఆమె జరిగిన దానికి చింతించవద్దని ఓదార్చి, మరికొంత ధనం యిచ్చి పంపింది కాని ఆ పర్యాయంగూడ మళ్ళీ దొంగలు దోచుకున్నారు. అతడు తిరిగి మళ్ళీ పెద్దమ్మ దగ్గరకు వచ్చినాడు. మళ్ళీ కొంతధనం యిచ్చి పంపిందిగాని ఆ తడవగూడ అంతే. అతడు దుఃఖంతో మళ్ళీ పెద్దమ్మగారి దగ్గరకు వచ్చినాడు.

అపుడు పుణ్యవతి బాగా ఆలోచించి వ్రతభ్రష్టులకు వ్రతస్థులధనం దక్కదు కాబోలు అనియెంచి ఆ పిల్లవానితో కేదారేశ్వరవ్రతం చేయించి రక్షకట్టి విసువక మళ్ళీ కొంతధనం యిచ్చి పంపించింది. ఈ పర్యాయం అతడు నిరాపదగా యిల్లు చేరినాడు.

అక్కగారు పంపిన ధనంతో యింటికి వచ్చిన కొడుకును జూచి ఇన్ని దినాలు వెళ్ళినావు నాయనా! నీకు మీపెద్దమ్మగారి దర్శనం తొందరగా కాలేదా! అని అడిగింది. అపుడతడు అదేంకాదని, తనను మూడు పర్యాయాలు దొంగలు కొట్టిన సంగతి, నాలుగవతడవ ఆమె కేదారేశ్వర వ్రతం చేయించి రక్షగట్టి పంపిన సంగతి తెలిపినాడు.

ఆ పిల్లవాడు తల్లితో తనఆలస్యానికి కారణం చెబుతుండగా వారికి ఆశ్రయమిచ్చిన బోయవాడుగూడా విన్నాడు. అతడు ఆ అడవిలోని గుంపులందరికి నాయకుడు. అందువల్ల అతడు తన గుంపులోని చారులను పిలిచి భాగ్యవతి కుమారుని దగ్గర ధనం దోచుకున్నవారి జాడదీసి పట్టుకొని తమ్మని పంపినాడు.

అతడు పంపిన చారులు వెళ్లి వేటాడి దొంగలను చిక్కించుకున్నారు. అపుడు వారు మర్యాదగా వచ్చి తప్పు వప్పుకొని లొంగిపోయి దోచుకున్న ద్రవ్యమంతా అప్పగించి వెళ్లినారు. అపుడు భాగ్యవతి తన తప్పు తెలిసికొని ఆ అడవిలో కుమారునితో కూడి తాను మరల భక్తితో కేదారేశ్వర వ్రతం చేసింది.

ఆ పుణ్య ప్రభావంచేత ఆతరువాత కొద్దిదినాలకే మహారాజు మళ్ళీ ఆమెను తన అంతఃపురానికి పిలిపించుకొని యథాప్రకారంగా చూచుకొన్నాడు.

తాతయ్యా! ఈ కథ వింటుంటె హ్యూయెన్‌త్సాంగ్ చెప్పిన దారి దోపిడిగాళ్లు జ్ఞాపకం వస్తున్నారు అన్నాడు కేశవుడు.

నేను అదే చెప్పవస్తున్నారా! చోళులు తెలంగాణంవారు కాబట్టి వారికి సంబంధించిన కథలన్ని ఇక్కడనే జరిగి ఉంటవని శ్రీ భావరాజు వెంకట కృష్ణారావు పంతులు గారంటారు.

చోళులకు మన జిల్లాతో సంబంధాలున్నవి. వారీ జిల్లాలోని కన్య లను చేసికొన్నారు. కాబట్టి భాగ్యవతి కథగూడ ఇక్కడిదే కావలె.

ఏ విధంగా తాతయ్యా? అని అడిగింది గౌరి.

ఆంధ్రమహాభారతాన్ని వ్రాయించిన రాజరాజ నరేంద్రుని తండ్రి విమలాదిత్యునికి యిద్దరు భార్యలుండే వారమ్మా! వారిలో పెద్దభార్య పేరు మేలాంబ. ఆమె పెదకంటి చోళుల యింటి ఆడపడుచు. ఈ పెదకల్లు మన జిల్లాలోనిదే అంటారు.

మన జిల్లాను కందూరు చోళులు, కోడూరు చోళులు అనే రెండు శాఖలవారు పాలించినారు. ఈనాడు కందూరు, కోడూరు రెండు మన జిల్లాలోనే ఉన్నవి.

పశ్చిమ చాళుక్య సామంతుడై కొలనుపాక నుండి తెలంగాణాను పాలించిన కొండయ చోళుని భార్యపేరు మైలాంబ. ఆమెది మన అచ్చం పేట ప్రాంతమే నంటారు. అందుచేతనే ఆమె తన రెండవ కుమారుడు నల్లభీమ చోడునికి తన పుట్టినింటి ప్రాంతమైన గట్టుతుమ్మెటి నుండి కోడలిని ఎన్నుకున్నది. ఆవిధంగా మన ప్రాంతం చోళులకు అమ్మమ్మగారి దేశం, అత్తవారి యిల్లుగూడ అవుతుంది కాబట్టి ఆ అభిమానంచేతనే వారిక్కడ ఆలయాలు కట్టించి వానికి దానాలు చేసి ఉంటారు.

మరి భాగ్యవతిది "ఉజ్జయిని" అన్నావుగదా! అన్నాడు కేశవుడు.

అది విక్రమార్క మహారాజు రాజధాని అని మా పాఠంలో వచ్చింది తాతయ్యా! అన్నది గౌరి.

మీ పాఠంలో చెప్పింది నిజమేగాని ఈ ఉజ్జయిని ఉత్తర భారత దేశంలోనిది గాదమ్మా! మనవైపు గూడ తక్షశిల, ఉజ్జయిని అనే పట్టణా

బున్నవి. తక్షశిలను 'తక్కశిల', ఉజ్జయినిని 'ఉజ్జలి' అని యిపుడు పిలుస్తున్నారు. ఉజ్జలిని చోళులే పాలించినారు.

పుణ్యవతి, భాగ్యవతి ఆ పట్టణానికి చెందినవారు కావలె.

అయితే అక్కడి రాకుమారుడు ఆమెను పెండ్లి చేసికున్నాడా? అడిగింది గౌరి.

కావచ్చును. మన దక్షిణ దేశంలో వర్ణాంతర వివాహాలు చాలా పూర్వంనుంచే ఉన్నవి. ఇక్ష్వాకు వంశీయుడైన మొదటి శాంతమూలుడు క్షత్రియుడై, మాఠరీ గోత్రానికి చెందిన బ్రాహ్మణ కన్యను వివాహం చేసికున్నాడు. కాకతీయులు శూద్రులైనా రుద్రమదేవి తన కూతురు రుయ్యమ్మను ఇందులూరి అన్నయ అనే బ్రాహ్మణుని కిచ్చింది. చెఱుకు బొల్లయ్యరెడ్డి అనే అమరనాయకుడు తన కొడుకు రాజన్నకు బ్రాహ్మణ పిల్లను చేసుకొన్నాడు.

మన దేశంలో పూర్వం అన్ని కులాలలోగూడ సామంతులు నాయకులై మండలాలు పాలించిన వారున్నారు కాబట్టి భాగ్యవతి తండ్రిగూడ అటువంటి ఒక సామంతుడు కావచ్చు.

పూర్వం రాజ్యాలు పాలించే వారినడుమ కులాల అడ్డుగోడలున్నట్టు కనిపించదు. హోదాను లేదా సామర్థ్యాన్ని బట్టే చుట్టరికాలు నడిచేవి అన్నాడు పరంధామయ్య.

# 17

తాతయ్య చెప్పేది వింటుంటే గౌరికి క్రొత్తక్రొత్త విషయాలు ఇంకా వినవలె ననే కుతూహలం పెరుగసాగింది.

ఆ పిల్ల మనస్సులో ఏవేవో స్పష్టాస్పష్టమైన ప్రశ్నలు పెనవేసుకొన్నవి. ఆమె మరేదో అడగటానికి ఊహను ఒకదారికి తెచ్చుకోసాగింది.

వారు అక్కడ కూర్చుని ఉండగానే పరంధామయ్యగారి దగ్గరకు ఒక వృద్ధుడు వచ్చి వంగి నేలనుతాకి నమస్కారంచేసి, అయ్యా, దండం పెడితిని. తలారి రామడిని అని ప్రవర చెప్పుకొన్నాడు.

ఆయన "కృష్ణార్పణం" అని స్వీకరించి, ఏం రామన్నా! ఎందుకో వచ్చినావు? అని అడిగినాడు.

సామీ! పిల్లను దీపాలపండుక్కు తీసుకొత్తున్నా! దాన్కి వడిబియ్యం పెట్టాలె. ఓ మంచిదినం సూడన్ని అని అడిగినాడు.

సరే! కూచో!... ఎవరికి! లచ్చికేనా!

అవును అయ్యగోరు! కాల్మొక్త. మొగనిపేరు బాలిగాడు. ఆనికి బట్టలుగూడ పెట్టాలె ననుకున్న. లేకుంటె ఊకునే టట్టులేదు- అని రామన్న కూర్చుని చేతిలోని కట్టెను కాళ్ల దగ్గర చక్కగా పెట్టుకొని సొద చెప్పుకున్నాడు.

రామన్నా, బాగా వచ్చినావు. పట్నంనుండి పిల్లలు వచ్చినారు. వారికి పల్లెటూరి ముచ్చటలంటె సరదా! వారు అస్తమానం ఊరివి గురించి నన్నేవేవో అడుగుతుంటారు. కాబట్టి నేను వాళ్లను పిలుస్తాను. వెనకటి జోలిఏదైనా నాలుగు మాటలు వాళ్లకు చెప్పు. నేనీలోగా పంచాంగంలో దినయుక్తం వెదుకుతాను అని, కేశవా! అని కేక వేసినాడు.

కేక విని కేశవుడు గరుడపక్షిపై అక్కడ వాలినాడు.

వానిని చూచి పరంధామయ్య- వరేయ్! నీవు నన్ను ఈ ఊరెవరు కట్టినారు అని ఏవేవో అడుగుతుంటావుగదా! అడుగో చూడు! తలారి

రామన్న వచ్చినాడు. ఊరిలో అందరికంటె పెద్దవాడు. అన్నీ చూసినాడు కాబట్టి నీ ప్రశ్న లతనినడుగు- అని పరిచయం చేసినాడు.

అదివిని రామన్న మీకంటె నేనేం చెప్పగల్ను? అన్నాడు.

ఎందుకు చెప్పలేవు- అన్ని విషయాలు అందరికీ తెలియవలెనని ఎక్కడుంది. వారడిగేది వారడుగుతారు, నీకు తెలిసినంతవరకు చెప్పు- అని తాను పంచాంగం కొటకు లేచినాడు.

అన్నయ్యా! నీవుఉండు నేనడుగుతాను! అని గౌరి ముందుకు వచ్చింది.

వారికట, ఈ ఊరు నెవరు కట్టించినారో! ఎప్పుడు కట్టించినారో చెప్పు అన్నాడు పరంధామయ్య.

ఈ ఊర్ని ఎవరు కావాల్నని కట్టించినట్టు లేదు సామీ ! ఇక్కడ కేదారేస్పరుడు పుట్టంగానే పక్కనవుండే సెన్నంరాజుపల్లె యిక్కడికి జరిగిందంట. ఇంక ఆతరువోత దినవారుస కాలాన పనివోల్లంతా యిక్కడికి సేరుకున్నరు, భూములు సంపాయించుకొని యిండ్లు గట్టుకొన్నరు.

ఈ ఊరు కేదార క్షేత్రమటగదా! అన్నాడు పరంధామయ్య.

అవును, పెద్దలన్నారు. కేదారమంటె నీరుపొలమంట. అన్నట్టు ఎనకటికిది పేరుకు తగినట్టే ఉండేది.

నీరుపొలమంటె ఏమిటి? అడిగింది గౌరి.

నీరుపొలం అంటె వడ్లుపండుతవా! అన్నాడు కేశవుడు.

అయ్యో! ఎందుకు పండవు? ఒకప్పుడు మాయిస్తారంగానే పండేవి. ఆ సంగతి మనూరులోని సెర్లు కుంటలే సెప్పుతయ్.

అవి చాలా ఉన్నవా! అని అడిగింది గౌరి.

అవును శానసే ఉన్నయ్. యెనకటికి దీన్ని పోలె నాయకుడు అనే అయ్న ఎల్నడంట. ఆయెనేపిచ్చిన సెరువిప్పుడు రంగంప్యాట దగ్గెరుంది. అయ్న యెయ్యేండ్ల కిందున్నడంట. అయ్న తరువోత నల్లప నాయకు డేల్నడంట. ఆయనేపిచ్చిన "నల్లసెరు" విప్పుడుంది. బాచెసాని అనే ఒగామె ఇక్కడో సెరువేయించింది. కతువ సెరువని మరోటుంది. యెవరేపించినారో మరి.

కాకతీయుల్నాడు "బండారు మాదేవుడు" అనే అయ్న ఈ రాజ్జెన్ని ఏల్నకంట. ఆయనేపించిన "మాసముద్రం" ఒగటుంది. అది నిజంగా సముద్దరమే. ఈ సముద్దరాలన్ని ఆరికాలం నాటివే అంటారు.

ఇంగ ఈ వూర్లో కుంటలకు లెక్కలేదు. వూ రేర్పడంగానే యిక్కడి దొరలు బాపని, కరణం, అవుసలి, కుమ్మరి మొదలైన పన్నెండు పనుల వోల్లను పిలుసుకొని బూము లిచ్చిన్రు. అల్లంతా తమతమ పొలాల్లో అనాదేయించుకున్న కుంటలిప్పటి కుందయ్.

కేసన్న, సెన్నమ్మ, శాయమ్మ ఈల్లంతా ఏయేకాలం వారో గాని అల్లపేర కుంటలుందయ్. యెనకటికి ఓ కుంటకాడ దొరగారి పసులదొడ్డి వుండెనంట. ఓనాటి సవయాన అవుల్ని యిడిసిన తరువాత అగ్గిపెమాదం జరిగి దానిలో ఉండే ల్యాగలన్ని కాలిసచ్చిన యంట. దాన్నిపుడు "దూడ్ల గాలిన కుంట" అంటుంటరు. ఇవిగాక ఇంకా ఈదులకుంట, ద్యావదారు కుంట, మల్లెకుంట, సప్పుళ్ల కుంట, అని పొలాలపేర కుంటలుండయ్. కాబట్టి అప్పటికాలాన ఈ కుంటలన్నిటి కింద జరిగే యెగుసాయంతో వూరి సుట్టంతా కండ్లపండుగగా ఉండేదంట,

రామయ్యా; ఈ ఊతిలో కోటగూడ ఉండిగదా! అన్నాడు కేశవుడు.

అవునుసామీ! ఉండవి. దాన్ని యేనెపల్లెవారు అనే యెలమ దొరలు కట్టింరంట. వాళ్లను ద్యావరకొండ దొరలు ఇక్క డికి తెచ్చి నిలిపినారంట. ఈ వూరేగాక వారికి యింగా, టంగాపురం, పులిజాం, మట్టిపల్లె, పలకపల్లె, కామసానిపల్లె, అచ్చంపేటగూడ వుండేవి. ఆవూర్ల కన్నిటికి యిది పెద్దగా వుండేది. ఆ దొరలు మొదట యిక్కడినే ఉండి తమవూర్లన్ని సూసేవారంట గాని యిప్పుడులేరు. ''కొండనాగు''లలో ఉండరు.

యేనెపల్లె వాళ్లంటె యెలమల్లో అందరికంటె పెద్దలంట పెండ్లిల్లో మొదటి తాంబూలం ఆళ్లకే ఇస్తరంట.

రామన్న పిల్లలకు చెబుతుండే విషయాన్ని వింటూ పరంధామయ్య పంచాంగం తెచ్చుకొని ఆకులు తిరగవేస్తూ వ్రేళ్లు లెక్క పెట్టుకుంటు కూర్చుండిపోయినాడు.

ఆయన వాలకం చూసి రామన్న, నన్నిక్కడ కూసుండ వెడితిరి. వేగి సూదంద్రి కాల్మొక్త! ఎల్లాలె, అన్నాడు.

చూసినాను రామన్నా! అల్లుని పేరు బాలిగాడు అన్నావుగదా! అమావాస్య వెళ్లిన అయిదు దినాలకు వారి పేర బాగుంది నీవు పిల్లలతో మాటాడుతూ ఉంటే నేను వినుకుంటు అలాగే ఉండిపోయినాను." అన్నాడు.

సామీ! ఇంగ నాకు సెలువియ్యన్రి అని లేచి దండంపెట్టి వెళ్ళినాడు రామన్న.

అతడు వెళ్ళినపిమ్మట గౌరి కేశవుడు తలారి రామన్నకు గూడ తాతయ్యకంటే చరిత్ర ఎక్కువనే తెలుసు అనుకొన్నారు.

# 18

ఆ మరునాడు వారియింటికి విశ్వంభరయ్యగారు తనకూతురిని తీసికొని వచ్చినాడు.

ఆయన పరంధామయ్యగారి షడ్డకుడు.

ఆయన కడపలో కాలుపెట్టగానే పరంధామయ్య భార్యను, ఒసేయ్ చెంబుతో కాళ్ళకు నీళ్లు పట్టుకురా! అని కేకవేసి తాను కంబళిపరిచినాడు.

భూదేవమ్మ లోపలినుండి యిత్తడిచెంబుతో నీళ్ళు పట్టుకొని వచ్చింది.

విశ్వంభరయ్య నీళ్ళు తీసుకొని కాళ్లుముఖం కడుగుకొని వచ్చి కంబళిపై కూర్చున్నాడు.

అతనివెంట వచ్చినామె నేరుగా లోపలికి వెళ్లింది. భూదేవమ్మ అక్కగారు బాగున్నారా బావగారూ! అనిఅడిగి, ఏమమ్మా శ్యామలా! బాగున్నావా! అని దగ్గరకు పిలుచుకొన్నది.

ఇప్పటివరకు అంతా కులాసాగానే ఉన్నాం అన్నాడాయన. బంధుమర్యాదానంతరం పరంధామయ్యగారు, ఏమిటీ విశేషం కూతురితోగూడ వచ్చినారు. ఎంతవరకు ప్రయాణం? అని అడిగినాడు.

ఇంతవరకే శ్యామలకు క్రిందటి సంవత్సరం వివాహం జరిగింది కదా! ఈ ఏడు దీపావళికి స్వాతికార్తె ఉందిగాబట్టి కేదారేశ్వర వ్రతం పట్టింతామని తీసుకువచ్చినాను.

ఇక్కడికి ఎందుకు! ఇంటిదగ్గరే పట్టించలేక పోయినారా? అన్నది భూదేవమ్మ.

తొలి నోము ఇ గదా! ఏదైనా మహాస్థలంలో పట్టించటం బాగు. ఇదేలాగు కేదారేశ్వర క్షేత్రమేనయ్యె. అందునా యిక్కడ మీరు పెద్ద మనుష్యులుంటిరి కాబట్టి మీచేత నోములు పట్టించవలెనని మీ వదినగారి కోరిక అన్నాడాయన.

మేమేం మీకంటె పెద్దవారమా!

ఏమో! అది నాకేం తెలియదు. తప్పించుకున్నాడాయన.

మరి యింత ముందుగా వచ్చినారు?

ఈ నోములు భాద్రపద శుద్ధ అష్టమి మొదలు దీపావళి వరకు ఎప్పుడైనా నోమవచ్చునుగదా! అందుచేత ఆలోపలే ఒక మంచిదినం నాడు నోములు పట్టించుకొని పండుగపూట మళ్లీ యింటికే వెళ్లుదామని-అన్నాడు విశ్వంభరయ్య.

అంత తొందరేమిటి బావగారూ! దీపావళి నాడే బాగుంటుంది. ఎంతైనా పర్వదినంగదా! అంతగా అయితే మీరు వెళ్లండి! శ్యామల అంతవరకు యిక్కడే ఉంటుంది అన్నది భూదేవమ్మ.

విశ్వంభరయ్యకు మాటకు అవకాశం దొరకలేదు. రాత్రికి భోజనానంతరం గౌరి కేశవుడు మామూలుగా తాతయ్య దగ్గరకు కథ చెప్పించుకోవటానికి వచ్చినారు.

వారిని చూచి ఏమిరా! ఎందుకో వచ్చినారు అన్నాడు విశ్వంభరయ్య. వారికి వేళప్పుడు ఏదైనా ఒక విషయం చెప్పవలె. ఈనాడిక అది నీ వంతు! అన్నాడు పరంధామయ్య.

దేన్ని గురించి చెప్పవలె అన్నాడు విశ్వంభరయ్య.

అడుగరా! కేశవా! ఆజ్ఞాపించినాడు పరంధామయ్య.

తాతయ్యా! పొద్దున మీరిది క్షేత్రమన్నారుగదా ! అట్లా అంటె ఏమిటి? అని అడిగినాడు కేశవుడు.

క్షేత్రమంటె దేవుడు వెలసినచోటు అన్నాడు పరంధామయ్య.

విశ్వంభరయ్య దాన్ని అందుకొని ఈలా అన్నాడు:

అబ్బాయ్! ఈనాడు ఏదో ఒక ఆలయంలేని ఊరులేదు. అయినప్పటికే ఊరిఊరికి ప్రాథమిక పాఠశాల ఉంటే అయిదారు గ్రామాలకు కలిపి ఒక హైస్కూలు పెట్టినట్టు వెనకటివారు దేవుడు స్వయంగా వెలసిన చోట ఆ దేవుని ప్రధానంగా చేసికొని యింకా ఇతర దేవతల ఆలయాలు గూడా కట్టి దాన్ని అందరికోలకు ఒక యాత్రాస్థలంగా రూపొందించినారు.

అన్నట్టు మీరిక్కడ కేదారేశ్వరాలయం చూసినారురా! అడిగినాడు విశ్వంభరయ్య.

ఓ! అని పిల్లలిద్దరూ తలత్రిప్పినారు.

మీరు చూసినారుగదా! అన్నాడాయన పరంధామయ్య నుద్దేశించి.

ఎందుకు చూడలేదు అన్నాడాయన.

దాన్ని ఎవరు కట్టించినారు- అడిగి నాడాయన.

కట్టించిన వారెవరో తెలియదు గాని పూర్వం మా ప్రాంతంలో అమరాబాదులో గుడిగడ్డన, చందాపురందగ్గర దేవరబండక్రింద రెండు పెద్దశిల్పశాలలు నడిచినవి. వానిలో పనిచేసినవారిలో కట్టోజు, బైరోజు అనేవారు మొదటి కాలానికి, వావిలేటివారు తరువాతి కాలానికి చెంది కనిపిస్తారు.

మా గ్రామంలోని ఆలయాన్ని కాసె కట్టోజు కట్టినాడు. అతడు కేదారేశ్వర భక్తుడుగా కూడ అనిపిస్తాడు. శుకవాసంలోని ఎడమవైపు

స్తంభంపై స్వామి కలిముఖంగా పద్మాసనం వేసికొని పబ్బతిపట్టి కూర్చున్నాడు.

అతడు భక్తుడేగాదు, అద్వైతిగా, మంచి తాత్వికుడుగాగూడ కనిపిస్తాడు. ఎందుకంటే నేను చూసినంతవరకు ఇక్కడి ఆలయం ఓ విశిష్ట పద్ధతిలో కట్టబడింది సుమా! ఇటువంటిది నాకీ చుట్టుప్రక్కలలో ఎక్కడా కనిపించలేదు అన్నాడు విశ్వంభరయ్య.

ఏవిధంగా! అన్నాడు కుతూహలంగా పరంధామయ్య.

శ్రీయన గౌరి నాబరగు చెల్వకు చిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్వము గొల్చెద నిష్టసిద్ధికై.

అనే తిక్కనగారి భారతావతారిక మీరు చదివిందేగదా! దీనిలో ఆయన లక్ష్మీపార్వతులను, హరిహరులను, అష్టాక్షరీ పంచాక్షరీ మంత్రాలను, ప్రకృతి పురుషులను, సగుణ నిర్గుణాలను కలిపి అద్వైతం సాధించినాడు గదా!

ఆనాటి సమాజస్థితి అట్టిది. శైవవైష్ణవులు పోరాడుతున్న కాలం గదా అదిమరి అన్నాడు పరంధామయ్య.

తిక్కనగారి అద్వైతానికి బీజాలు మన దేశంలో చాలా ప్రాచీనం నుండే కనిపిస్తున్నవిసుమా! ఉదాహరణానికి మీగ్రామంలోని ఆలయాన్నే తీసికోవచ్చు. దానిలో శిల్పి పూర్వాభిముఖంగా కేదారేశ్వరాలయం దక్షిణాభిముఖంగా చెన్నకేశవాలయం ఒకేదానిలో నిబంధించి తిక్కనగారి అద్వైతాన్ని తన శిల్పంలో ప్రదర్శించినాడుగదా!

అవునుసుమా! నేనిది ఎప్పుడూ గమనించలేదు అన్నాడు పరంధా మయ్య.

అంతేగాదు. శంకరు దంగీకరించిన షణ్మతాలు ఒకనాడిక్కడ నిలిచిఉన్నవా అనిపిస్తుంది. శైవం, వైష్ణవం, శాక్తేయం, గాణాపత్యం, సౌరం, కాపాలికం, అనే మతాలు మనప్రాంతలో కనిపిస్తూనే ఉన్నవి. ఇక ఈ గ్రామంలో కేదారేశ్వర చెన్నకేశవాలయాలేగాక గణపతి ఆలయం అంబగుడి ఉన్నవి గాబట్టి వానినిబట్టి పూర్వాం యిక్కడ పంచాయతనం గూడ ఉండెనేమో అనిపిస్తుంది.

ఆదిత్యుడు, అంబిక, విష్ణువు, గణనాథుడు, మహేశ్వరుడు, ఈ అయిదుగురు పంచాయతన దేవతలు. వానిలో ఎవరు నడుమ ఉంటే అది ఆ పంచాయతనం అవుతుంది కాబట్టి శిల్పి యిక్కడ శివపంచాయతనాన్ని ఉద్దేశించినాడా అని అనుమానం.

విశ్వంభరయ్య చెప్పే విషయాలన్నీ అర్థంగాకున్నా ఆ రాత్రి గౌరి కేశవుడు శ్రద్ధగా విన్నారు.

## 19

మరునాడు పిల్లలు పరంధామయ్యగారి దగ్గరకు వచ్చి, రాత్రి తాత గారు చెప్పింది మాకు పిసరంతగూడా అర్థంగాలేదు అన్నారు.

మనఊరిలో ఉండే ఆలయాన్ని గురించి మరోసారి చెప్పవలె తాతయ్యా! అన్నది గౌరి.

అయితే కూచోండిరా! అన్నాడాయన.

వారు బుద్ధిగా కూర్చున్నారు.

మొదట ఊరిలో ఏయే దేవతలుంటారో, వారిని ఎందుకు నిలుపుతారో చెబుతా వినండి. బొొడ్రాయి అని ఎప్పుడైనా విన్నారా! మీరు.

అది ఏదో ఊరిలో ఉంటుందట తాతయ్యా! అన్నాడు కేశవుడు.

అవునుతా ! ఊరుకట్టే అపుడు బొొడ్రాయి నిలిపిన తరువాతనే అక్కడ ఊరు మొదలు పెడతారు. ఉండదలచిన వారంతా బొొడ్రాయికి ఏ దిక్కుగా ఉంటే తమకు అచ్చిపాటు ఉంటుందో చూసుకొని యిండ్లు కట్టుకుంటారు.

ఊరికి ఆవిధంగా బొొడ్రాయిని ప్రతిష్ఠించే అపుడు దానిక్రింద శీతలాయంత్రాన్ని ఉంచుతారు. ఆ యంత్రానికి అధిదేవత శీతలాదేవి. ఆ దేవిని పల్లెటూరి వారు ''పోచమ్మ'' అని పిలుస్తారు కాబట్టి ఊరుఏర్పడగానే మొదట అక్కడ పోచమ్మను నిలుపుకుంటారు. ఆ తరువాత ఊరికి పొలిమేర ఏర్పాటుచేసి దానిపై ''పొలిమేర'' కు అధిదేవతలను నిలుపుతారు. ఆ దేవతలను ''పోలేరమ్మ'' అని, పొలిమెరకు ''ఎల్ల'' అని గూడ పేరు కనుక ''ఎల్లమ్మ'' అని గూడ అంటారు.

ఈ ఎల్లమ్మ ఒకవిధంగా గ్రామదేవత. పూర్వం శ్రీరామునికొడుకు కుశమహారాజుకు అయోధ్యా పురదేవత, బుక్కరాయల కొడుకు కంపరాయలకు మధురాపురి దేవత ప్రత్యక్షమైనారట.

ఏ గ్రామానికైనా సంకటం వచ్చినపుడు అక్కడి నగరదేవతలు దాన్ని పాలించే రాజులకు కలల్లో కనిపించి తమ స్థితి చెప్పుకున్నట్టు మన పురాణాలలో ఉంది.

ఎల్లమ్మ తరువాత చెప్పదగింది ''ఇదమ్మ'' ఈమె ఇంకా అందరికంటె ప్రాచీన దేవత అంటారు.

వేదంలో ఇడాదేవత ఉందట. ఇడా అంటే చంద్రనాడి. చంద్రుడు మన మనస్సుకు అధిపతి కాబట్టి 'ఇదమ్మ' గ్రామలక్ష్మికి మనస్సు అనవచ్చు.

ఇక హనుమంతుడు లేని ఊరు ఉండదు. అతడు వాయుదేవుని కుమారుడు గాబట్టి గ్రామానికి ప్రాణంకింద లెక్క.

మనుష్యులకు హృదయపద్మంలో ఈశ్వరుడుంటాడు గాబట్టి గ్రామంలో గూడ పూర్వం హృదయ స్థానంలో విష్ణ్వాలయమో ఈశ్వరాలయమో ఉండేది.

అసలు ఆ ఆలయం కట్టిన తరువాతనే ఊరును మొదలు పెట్టే వారు. మన ఊరి విషయం అలాగే జరిగింది అనుకున్నాంగదా!

మరి పంచాయతన మంటే ఏమిటి? అని అడిగింది గౌరి.

పంచాయతనమంటే అయిదుగురు దేవతలు. మన శాస్త్రంలో ఒక్కొక్క సంఖ్యకు ఒక్కొక్క ప్రాధాన్యం ఉంది.

సంఖ్యా శాస్త్రంలో ఒకటి రెండు అనే అంకెలు ఎన్ని వేసినా వానిలో అసలైన అంకెలు తొమ్మిది మాత్రమే. వానిలో అయిదు సరిగా నడిమి అంకె అవుతుంది కాబట్టి దానికి అన్నిటికంటె ఎక్కువ ప్రాధాన్యం ఉంది.

పంచభూతాలు, పంచప్రాణాలు, పంచేంద్రియాలు అనే పేర్లు మీరు విని ఉంటారు. మన దేవతలలో చాలామంది ఉన్నారు కాబట్టి అందరిని పూజించటం కష్టం కనుక ప్రాచీనులు వారిలో శివుడు, విష్ణువు, గణపతి, పార్వతి, సూర్యుడు అనే అయిదుగురిని ప్రధానంగా ఎన్నిక చేసినారు. ఆ అయిదుగురికి పంచాయతన దేవతలని పేరు.

గృహస్థు డెవరిని పూజించినా, పూజించకున్నా ఆ అయిదుగురు దేవతలను తప్పక పూజించవలె పూర్వం మన గ్రామంలో గూడ ఆ అయిదుగురు దేవతలుండేవారని రాత్రి తాతయ్య గారంటారు.

ఇపుడు మనం శివాలయం, కేశవాలయం, గణపతిగుడి, అంబ గుడి చూస్తూనే ఉన్నాంగదా! గణపతిమూర్తి నల్లరాతిలో మలిచిన వానిలో మన ఊరిలో ఉన్నంత పెద్దది అందంగా ఉండి సజీవమయింది ఈ ప్రాంతంలో మరెక్కడా లేదు.

పశ్చిమ చాళుక్యులు గణపతి భక్తులు గనుక వారి కాలంలో మన ప్రాంతంలో పెద్ద పెద్ద మూర్తులు వెలసినవి. వారు గణపతితో పాటు మాతృకలను గూడ కొలిచినారు.

మాతృకలంటే ఎవరు తాతయ్యా? అని అడిగింది గౌరి.

శివుని పరిచారికలమ్మా. అతడు మనకు వైదిక దైవంగానే గాక, అతడు అతని పరివారము, కృషీవల దైవాలుగా గూడ కనిపిస్తారు. శివుడు పశుపతిగా మొహంజదారో, హరప్పా కాలాలనుండి ఆరాధింపబడు తున్నాడు. ఆతని భార్య గౌరమ్మ అచ్చంగా పల్లెవారి దేవత. ఆమెకు జానపదుల వంటకాలంటేనే ఎక్కువ ఇష్టం. వారి వాహనమైన నందీశ్వరునికి, రైతులు తమ పొలంలో మొదట ఈనిన కఱ్ఱలు గుర్తుంచుకొని కోతనాడు మొదట ఓపదిగల కోసుకొనివెళ్ళి ముందుంచి దండం పెట్టి తమ కాడిపశువులకు తినిపించుకుంటారు. ఆ విధంగా చేస్తే వాటికి ఏ అరిష్టాలు సోకవని వారి నమ్మకం.

ఈ పరమశివుని కుటుంబాన్ని బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండ అనే ఏడుగురు సేవిస్తుంటారు. వారికే మాతృకలని పేరు. వారిని కొలిస్తే పంట పొలాలకు వన్యప్రాణి బాధ ఉండదట. వినాయకుని గూడ సస్యాధి దేవతగానే నమ్ముతారు, ఆ

కారణంగానే కావచ్చు, చాళుక్యులనాటి శిల్పులు కొన్నిచోట్లలో వినాయకుని మాతృకల ఇతనే మలిచినారు. పశ్చిమ చాళుక్యులు దేశంలో పంటల అభివృద్ధికి కృషిజేసిన వారిలో ఒకరు గాబట్టి ఆ కారణంగానే వారు మాతృకారాధన ప్రవేశ పెట్టి ఉంటారు. మనది వ్యవసాయ ప్రధాన దేశం గనుక ఇపుడు గూడ ఆ దేవతలను కొలవటం అవసరం.

మన గ్రామంలో పూర్వం అంబ గుడి గూడ గొప్పగానే ఉండేదట గాని ఇపుడు కూలిపోయింది. ఇక పోతరాజుకేమో గుడి మిగిలింది కాని దేవుడు మాత్రం లేడు.

పోతురాజు ఏంపేరు తాతయ్యా! అని గౌరి కిలకిలమంది. ఏం? పోతురాజు పేరు వినలేదా నీవు ఎప్పుడు? పోనీ కామేశ్వరిదేవి పేరైనా విన్నావా ?

దేవతను చూడలేదుగాని కామేశ్వరి అని మాతరగతిలో ఓ బాపని వారి పిల్ల ఉంది.

కామేశ్వరీ దేవిగూడ బ్రాహ్మణుల దేవతనేలే !

ఆహా ! యాదికి వచ్చింది తాతయ్యా ! మొన్న ఒకనాడు బామ్మ ఒక పాట పాడుతూ చెప్పింది. వారు ఏడుగురు అక్కా చెల్లెండ్రదట. పార్వతీ దేవి ఏదో కొలనులో స్నానంచేస్తుంటే పుట్టినారట.

అవును కథలో అలాగే ఉంది, ఆ అక్కాచెల్లెండ్రలో కామేశ్వరి బ్రాహ్మణులకు ముఖ్యమైనదేవత. ఆమెను "కామవల్లి" అనిగూడ అంటారు. శ్రీనాధుడు క్రీడాభిరామంలో ఆమె కొలువు చెప్పినాడు. పోతురాజు ఆ అక్కాచెల్లెండ్ల తోడ బుట్టినవాడు కాబట్టి అతని ఆలయాన్ని బట్టి పూర్వం మన గ్రామంలో కామేశ్వరీదేవిని గూడ పూజించే వారుండేవారేమో అనుకోవలసి వస్తుంది.

మరి పోతురాజు గుడేగాక "ముక్కిడిగుడి" గూడా ఒకటి ఉందే, మరి అది ఏ దేవునిది ? అడిగినాడు కేశవుడు.

అది ముక్కిడిగుడి గాదురా ! మ్రొక్కుడుగుడి, మ్రొక్కుడుగుడి.

పూర్వం ఎక్కడైనా ఆలయాలు ఎక్కువగా ఉండి వానిలో రద్దీ ఎక్కువగా ఉంటే భక్తులు మ్రొక్కులు చెల్లించటానికి వేరే ఒక మంటపం గట్టేవారు. దానికి మ్రొక్కుడుగుడి అని పేరు. అక్కడ గ్రామంలో ఉండే దేవతలందరి పేర డిబ్బీలుండేవి. భక్తులు దైవదర్శనాంతరం అక్కడికి వచ్చి దానిలో కానుకలు వేసి, వ్రతాలు చేయటం, తల నీలాలర్పించటం వంటివన్నీ చెల్లించేవారు.

అయితే వెనకటికి మన ఊరిలో చాలా ఆలయా లుండేవన్నమాట! అన్నాడు కేశవుడు.

మరే మనుకున్నావు అన్నాడు పరంధామయ్య.

దీన్ని క్షేత్రం అన్నావు గదా ! తాతయ్యా ! ఈ చుట్టుపట్ల ఇంకా అటువంటివి ఏమైనా ఉన్నవా? అని అడిగింది గౌరి.

అయ్యో లేకేమిటి ? క్షేత్రాలన్నిటికి తలమానికమైన ఉమా మహేశ్వరమే మన వాకిటిలో ఉంటేను,

ఈ ప్రాంతంలో పూర్వం మైలారక్షేత్రం, కొండనాగుల నాగ క్షేత్రం, మామిళ్ళపల్లె నృసింహక్షేత్రం, ఇంద్రకల్లు జైనక్షేత్రం, తరణి కల్లు సౌరక్షేత్రం, ఇట్లా ఒక్కొక్క దేవుని పేర పూర్వులు ఒక్కొక్క క్షేత్రం నేర్పరచి ఏటేటా అక్కడ ఉత్సవాలు నడిపేవారు.

లేకుంటే అందరికీ శ్రీశైలం, తిరుపతి, శ్రీరంగం వంటి మహాక్షేత్రా లకు వెళ్లటం సాధ్యం కాదుగదా ! మ్రొక్కులు తీర్చుకునే అందుకు అన్నాడు పరంధామయ్య.

# 20

భూదేవమ్మగారి మాటప్రకారం విశ్వంభరయ్య తమ కూతురు శ్యామలను అక్కడే ఉంచి, మీరు పండగనాడు నోములు పట్టించండి. ఆనక నేనువచ్చి తీసుకువెళ్ళుతాను అని చెప్పి మరునాడు తాను వెళ్ళి పోయినాడు.

విశ్వంభరయ్యగారు వెళ్ళిన పిమ్మట గౌరికి కేదారేశ్వర వ్రతం ఎందుకు చేయవలెననే సందేహం కలిగింది.

ఆమె బామ్మను అడుగుతూ ఉండగా పరంధామయ్యగారు విన్నారు. ఆయనకు సంతోషం కలిగి గౌరిని దగ్గరకు పిలుచుకొని, ఆడపిల్లవు, ఈ నోములు, వ్రతాలు ఎందుకో ముఖ్యంగా వినవలసినదానివి. చెబుతాను, అన్నాడు.

మనది హిందూసమాజము. ఈ సమాజంలో స్త్రీలకు చాలా ప్రాధాన్యం ఉంది. అందువల్ల నియమనిష్ఠలు మొగవారికంటె వారే ఎక్కువగా పాటించ వలసి ఉంది ఆకారణంగానే వారినుద్దేశించి అనేకమైన నోములు, వ్రతాలు ఏర్పరచినారు.

పురాణ కాలంలో గురుకులాలలోని ఋషి వాటికలలో బ్రహ్మచారు లతోపాటు కన్యలుగూడ మునిపత్నులను సేవించి ఎన్నెన్నో విషయాలు నేర్చుకొనేవారు. కాని తరువాత కాలంలో స్త్రీకి ఆ అవకాశం లేకుండా పోయింది. సంఘంలో వారికి రక్షణగూడా కరువయ్యింది.

ఆడపిల్ల తనకు కావలసిన సంసారిక శిక్షణ యింటిలోనే నేర్చు కోవలసి వచ్చింది.

''నోము'' అంటే ఏమిటనుకున్నావు? అది ''నియమం'' అనేదాని యొక్కరూపం. అంటే ఉండవలసినతీరుగా నడుచుకునేపద్ధతిని నియమం

అంటారు గాబట్టి హిందూ స్త్రీకి ఈ నోములవల్ల కావలసినంత క్రమ శిక్షణ లభిస్తుంది. వానిలో కన్నెలనుద్దేశించినవి కొన్ని, వివాహితలనుద్దేశించినవి కొన్ని ఉన్నవి. ఉదాహరణానికి కన్నె తులశమ్మ నోము, అట్లతద్దె వంటివి పెండ్లిగాని పిల్లల కొఱకైతే, వరలక్ష్మీ వ్రతం, కేదారేశ్వర వ్రతం వంటివేమో పెండ్లి అయిన వారికోసం ఏర్పరచినారు.

ఈ నోములలో ఒక్కొక్కదానిలో కొన్ని నియమాలుంటవి. ఒక్కొక్క దేవత పూజింపబడుతుంది. కాబట్టి బాలికలకు ఆ నియమం వల్ల లౌకిక శిక్షణ, దేవతా పూజ వలన ఆత్మ శక్తి కలుగుతవి.

అయితే కేదారేశ్వరవ్రతంచేత ఏంఫలితం కలుగుతుంది? అని అడిగింది గౌరి.

చూడమ్మా ! ఈనాటి స్త్రీలంతా భార్యలు లేదా దారలేగాని అర్థాంగులు కారు. భార్య అంటే భరింపబడేది కాబట్టి బరువుగా తయారయ్యేది అని, దార అంటె తనయొక్క బరువు చేత భర్తను బెదిరించేది లేకుంటే అతనిని చూచి బెదిరిపోయేది అని తాత్పర్యం. ఇది ఆనాటి ఆడపిల్లల స్థితికాని పెండ్లామంటే మొగనికి బరువుగా కాగూడదుగదా ! అతని ఆలోచనలలో గాని, పనిలోగాని సగం పాలు పంచుకొని సలహాదారుగా ఉండవలె గదా ! అటువంటి స్త్రీకి "అర్థాంగి" అని పేరు. లోకంలో స్త్రీ భార్యగా బ్రతుక వచ్చుగాని అర్థాంగి గావటం కష్టం.

అయితే ఈ వ్రతం చేస్తే అవుతారా !

వ్రతమాహాత్మ్యం అవుతారనే చెబుతుంది. అందుకే మనవారికి ఈ వ్రతమంటే ఎక్కువ మక్కువ.

దీన్ని పూర్వం ఎవరు చేసినారు ?

ఎవరో ఎందుకమ్మా! సాక్షాత్తుగా ఆ పార్వతీదేవి అమ్మవారే మొదట చేసింది.

పార్వతీదేవా !? ఆమె ఎందుకు చేయవలసి వచ్చింది ?

తీగలాగితే డొంకంతా కదులుతుంది. చెబుతా వినుమరి.

పూర్వం ఓ పర్యాయం కైలాసంలో శివపార్వతులు కొలువు తీరి ఉండగా వారి ముందు రంభ నాట్యం చేసింది. ఆమెను చూసి భృంగిరిటి అనే సేవకుడు గూడ చేసినాడు. అదిచూచి శివుడతనిని మెచ్చుకున్నాడు. దానితో అతడు పొంగిపోయి శివునికి ప్రదక్షిణం చేసి నమస్కరించినాడు.

కొలువు ముగిసిన పిమ్మట పార్వతి శివుని, అతడు మీకొక్కరికే నమస్కారం చేసినాడేమిటి ? అని అడిగింది.

భక్తులకు నీతో ప్రయోజనం లేదుగదా ! అన్నాడు శివుడు.

అది విని ఆమె చిన్నబుచ్చుకొని శివుని విడిచివెళ్ళి కొంతకాలం తపస్సు చేసింది.

ఆమె శివుని భార్యనే గదా ! మళ్ళీ ఎవరిని గురించి తపస్సు చేసింది ? అడిగింది గౌరి.

శివుని గురించే.

అదేమిటి ? అంతవరకే ఆమె అతనిని తపస్సుతో మెప్పించేగదా, పెండ్లి చేసుకొన్నది.

అక్కడే ఉందమ్మా కిటుకు. శివుడామెకు భర్తనే ! సందేహం లేదు గాని మొగడు పెండ్లానికి అన్నివేళల లోను, అన్ని విషయాలలోను అనుకూలంగా ఉండడు. అది సంపాదించుకోవాలంటే ఆమె అతని మనసెరిగి నడుచుకోవలె. అదీ ఒక తపస్సేగా మరి.

మొగవాని "యిష్టం" అనేక రకాలు గాబట్టి ఎప్పుడేలాగుంటుందో భార్య ఎంతో తెలివయింది అయితేనే పసిగట్టగలదు. భగవంతుని విభూతులూ అంతే. అవి అనేకం కాబట్టి ఏ విభూతి నారాధిస్తే ఏ కోరికలు సాధించుకోవచ్చునో భక్తులకే తెలుసు.

అయితే గౌరి శివుని ఏ విధంగా ఉపాసించింది? "కేదారుని" కొలిచిందా! అన్నది గౌరి.

అంతేగదా అర్థంమరి. ఆమె శివుని ఆ రూపంలో ఉపాసించి అర్ధ దేహాన్ని పొందింది. ఆనాటినుండి యిక శివపార్వతులిద్దరూ కలిసి ఏక దేహులైనారు. నాటినుండి శివునికి అర్ధనారీశ్వరుడనే పేరేర్పడింది. నిజానికి గంగ అతని భార్యగాదు, పార్వతియే అతని భార్య.

స్త్రీ పురుషునికి భార్యగా ఉండవచ్చుగాని సతీపదాన్ని, అర్ధాంగి పదవిని పొందినప్పుడే ఆమెకు గౌరవం కాబట్టి అది పొందటం కొఱకు ఆమె తపస్సే చేయవలసి ఉంటుంది.

మరోమాట! పార్వతి ఆనాడు శివుని అర్ధదేహాన్ని పొందటానికి ఎక్కడ తపస్సు చేసిందో తెలుసా?

ఉహూఁ! తలఅడ్డంగా తిప్పింది గౌరి.

ఇక్కడేనమ్మా! మనకతి సమీపంలోనే చేసింది. నల్లమలలోని కొండమీద. దాన్నే ఇపుడు మనం "ఉమామహేశ్వరం" అంటున్నాము. ఉమాదేవి పూర్వం దానిపై తపంచేసింది గాబట్టి ఆ కొండకు "ఉమాగిరి" అనే ప్రసిద్ధి కలిగిందని శ్రీశైల స్థలపురాణం చెబుతుంది.

తాతయ్యా! పార్వతీదేవి ఇక్కడికి సమీపంలోని ఉమాగిరి మీద తపస్సుచేసింది; ఆమె ఆరాధించిన కేదారమూర్తి యిక్కడ పుట్టింది; యిది చిత్రంగా ఉందే.

చిత్రమేమిటమ్మా! అనాటికి యిక్కడ ఇదీ అదీ అనే భేదం లేదు. ఈ తాలూకా అంతా "మహేశ్వరమండలం" అనే పేరుతోనే పిలువబడేది. కాబట్టి కేదారేశ్వరు డెక్కడ పుట్టినా ఆమె తపోక్షేత్రంలో పుట్టినట్టే. ఆ విధంగా శివుడు ప్రత్యక్షమైన స్థానాలు మన తాలూకాలో యింకా వున్నవి. అందుకే దీన్ని "నీలకంఠ పుణ్యక్షేత్రమ"ని పూర్వులు పిలిచినారు.

# 21

విశ్వంభరయ్య వెళ్లిన వారం దినాలకు దీపావళి వచ్చింది.

ఆనాడమావాస్య. నోములుగూడా ఆనాడే.

భూదేవమ్మ తెల్లవారక మొదలే లేచి దాగడి క్రిందవేసి నీళ్ల కాచింది. పిమ్మట పరంధామయ్యగారు లేచేవరకు మంగళహారతికి అన్ని సిద్ధంచేసి ఆయనను, రండి మంగళహారతి తీసికొందురు అని పిలిచింది.

ఆయన పిల్లలనుగూడ తీసికొని వచ్చి ఆమె పరచిన తివాసీపై కూర్చున్నాడు.

ఆమె మంగళహారతి అంతవరకే ముట్టించి దేవునిదగ్గర ఉంచింది. దాన్ని తెచ్చి వారికి దర్శనం చేయించి ఒకపాట పాడి తలకు నూనెరాచింది. అనంతరం పరంధామయ్య దానిలో పిల్లలచే పైసలు పెట్టించి తానుగూడ ఒక రెండు రూపాయలు పెట్టి లేచి వెళ్లి స్నానాదికం ముగించుకొన్నాడు.

స్నానానంతరం భూదేవమ్మ కేశవునితో పాలపందిరి కట్టుమని పురమాయించింది.

కొంచెం ప్రొద్దెక్కిన పిమ్మట ప్రక్కింటి రాము, గోపాలం మామిడాకులు, జొన్నగడలకై బయలుదేరినారు.

కేశవుడుగూడ వారితో బయలుదేరినాడు.

అంతా కలిసి ఒక పొలంలోనికి వెళ్లినారు. ప్రకృతి ఎక్కడ చూచినా పచ్చగా కన్నుల పండువుగా ఉంది.

మొదట వారంతా ఒక మామిడి దగ్గరకు వెళ్లినారు. గోపాలం చెట్టెక్కి ఆకులు మంచిగా ఉండే మండలు ఏరి యేరి త్రెంపి క్రిందికి వేసినాడు. రాము, కేశవుడు వానినేరి ఒక సంచిలో పెట్టినారు. పిమ్మట అక్కడినుండి మఱ్ఱిచెట్టు దగ్గరకు దారితీసినారు. ఈ పర్యాయం దాన్ని రాము ఎక్కి ఆకులు కోసి మడతలు మడతలుగా క్రిందికి వేసినాడు. గోపాలం, కేశవుడు తీసి సంచిలో పెట్టినారు. ఆకుల పిమ్మట ఇన్ని ఊడలు కోసి చేతపట్టుకొని రాము చెట్టు దిగినాడు. తరువాత వారందరు యింటిముఖం పట్టి, దారిలో మంచిగా పొత్తులు విడిచిన జొన్నకఱ్ఱలు, చితపలకాయలు, బంతిపూలు, ఒక ఓడికలో ఇంత పశువులు త్రొక్కని యిసుక తీసికొని యిల్లు చేరినారు.

పురాణ కాలంలో ఈ వ్రతం ఒక నదీతీరంలో ఇసుక తిన్నెలపై మఱ్ఱిచెట్ల నీడలలో చేసేవారు. ఇపుడాదినాలు పోయినవి కనుక ఇంటిలో పూజాపీఠం పైననే ఇంత యిసుక పోసి మఱ్ఱిఊడలు పెడతారు.

కేశవుడు పాలపందిరి చుట్టు మామిడాకు తోరణాలు, దాని కంబాలకు జొన్నగడలు కట్టి పందిరినుండి క్రిందికి చితపల, దానిమ్మ కాయలు వ్రేలాడ దీసినాడు. తరువాత బామ్మగారు చెప్పినట్టు చేస్తూ ఆ పందిరి క్రింద పెద్ద పీటవేసి దానిపై యిసుకపోసి దానిమీద మఱ్ఱి ఆకులతో కుట్టిన విస్తరివేసినాడు. పైన ఒక క్రొత్తబట్ట పరిచి దానిపై పసుపు ఒక గిన్నెలో కలిపి సన్నని పుల్లతో పద్మంగీసి దానిపై బియ్యంపోసి నేర్పి ఒక కలశంపెట్టి అందులో టెంకాయను మామిడి ఆకులలో నిలిపి పసుపు కుంకుమలతో అలంకరించినాడు. ఆ కలశానికి ఒకవైపు తమలపాకులు మరోవైపు మఱ్ఱి ఊడలు తమలపాకులు పోకలు పెట్టినాడు.

ఈ వ్రతాలలో ఒక్కొక్క దానికి ఒక్కొక్క సంఖ్య ఉంది. అక్కడ ఉంచవలసినవి గౌరీ వ్రతానికి పదేసి, లక్ష్మీదేవి నోములకు పదకొండేసి, అనంత పద్మనాభ వ్రతానికి పదునాలుగేసి ఉంచుతారు.

భూదేవమ్మ ఈ వ్రతానికి అన్నీ ఒక్కొక్కటి యిరవై ఒక్కటి లెక్కన పెట్టించింది.

తరువాత కేశవుడు మిగిలిన వస్తువులు, పూలు వేరువేరు బుట్టలలో సర్ది అక్కడ పెట్టినాడు. ఈలోపల భూదేవమ్మ దేవునికి కావలసిన వంట నంతా పూర్తిచేసింది.

శివుడు చాలా ప్రాచీనదైవం. అతడు తలపై జడలు ధరించి, చర్మం కట్టుకొని, చేతిలో త్రిశూలం పట్టుకొని ఉంటాడు. ఎద్దునెక్కుతాడు. ఈ లక్షణాలనుబట్టి అతనిలో వైదిక ముద్రకంటే దేశీయతా లక్షణాలు ఎక్కువ. అతనివలెనే అతని భార్య పార్వతిలోగూడ దేశీయ లక్షణాలే ఎక్కువ. ఆమె రాగిసొమ్ములు పెట్టుకుంటుందట. పల్లె ప్రజలు గౌరమ్మకు కొఱ్ఱ పరమాన్నం, కొఱ్ఱ బూరెలు, కలియగాయ యిష్టమని నమ్ముతారు.

భూదేవమ్మగారు పరంధామయ్యగారితో చెప్పి పండుగ నాటికని కొఱ్ఱలు తెప్పించి వానితో పరమాన్నం ఇన్ని బూరెలు చేసింది.

కొఱ్ఱపొట్టు తింటె ఈగలు కొట్టుకపోతవి అని జానపదుల నమ్మకం.

పల్లెటూళ్ళలో శ్రావణం నుండి ఈగకొట్టు మొదలవుతుంది. ఏ యింటిలో చూచినా ఈపటీగలు జిబ్బుమని ముసురుతుంటవి కాబట్టి కేదారేశ్వరుని నోములకు యింటిలో కొఱ్ఱలు దంచి చెరిగితే ఆ పొట్టువల్ల వాని పీడ విరుగడై పోతుందని కాబోలు ఆపండుగకు కొఱ్ఱలవంటకాన్ని విధించినారు.

మన పండుగలలోనేకాదు అపుడు పాటించే ఆచారాల వెనుక, చేసికొని తినే వంటకాల వెనుకగూడ ఆధ్యాత్మికానికి, ఆరోగ్యానికి సంబం ధించిన రహస్యాలెన్నో ఉన్నవి.

గౌరమ్మకు కలియగాయ యిష్టం కాబట్టి అనాడు భూదేవమ్మ కాకర బీర, పొట్ల, గోకర, బెండ, వంగ మొదలైన యిరువదొక్క విధమైన కాయలు సంపాదించి అన్నీ కలిపి నివేదనకు కూర వండింది.

వంట ముగిసిన పిదప శ్యామలను కేదారేశ్వరాలయానికి తీసికొని వెళ్ళి గోత్రనామాలు చెప్పి పూజ చేయించి హారతి యిప్పించి యింటికి తెచ్చి ఇక పరంధామయ్య గారి దగ్గరకువెళ్ళి, ఏమండీ! కావలసిన పని అంతా పూర్తి అయింది. ఇక పురోహితునిదే ఆలస్యం. బ్రాహ్మణుని తీసుకు వస్తారా! ఇప్పటికే ఆలస్యం అయిపోయింది అన్నది.

భార్య మాటలు విని పరంధామయ్యగారు కండువా భుజాన వేసి కొని వెళ్లి అరగంటసేపటిలో పురోహితుని వెదకి తీసుకొని వచ్చినాడు.

పురోహితుడు వచ్చేవరకే భూదేవమ్మగారు అన్నీ అక్కడ కొదు వలేకుండ ఆసాదించింది.

పురోహితుడు వచ్చి తనకోసం వేసిన పీటపై కూర్చుంటూ, దండలు తెప్పించినారా! అన్నాడు.

తెప్పించినాను. ఈమె మా అక్కగారి కూతురు. ఈసారి ఈ అమ్మాయికి నోములు కూడ పట్టించవలసి ఉంది అందువల్ల "నోము ముడి" గూడ చేయించినాను అని ఒక చిన్న ఆభరణాన్ని తెచ్చి చూపింది.

అది బంగారంతో చేయబడింది. చిన్న గొలుసు కడియంవలె ఉంది దానికి రెండువైపులా గ్రుచ్చుకోవటానికి కొండ్లున్నవి.

పురోహితుడది చేతికి తీసికొని పరిశీలించి, దీన్ని కూడ గౌరమ్మ ప్రక్కనే ఒక కొబ్బరిగిన్నెలో పెట్టి ఉంచండి. ఇక మీరు కూర్చోండి అని తొందరించినాడు.

వారు పూజాపీఠం ముందు కూర్చున్నారు.

ఆయన, దీపాలు ముట్టించి వానికి అలంకారం చేయండి అని చెప్పి, ''శుక్లాంబర ధరం విష్ణుం'' అని గణపతి పూజ నెత్తుకున్నాడు.

భూదేవమ్మ శ్యామలతో బ్రాహ్మణుడు చెప్పినట్టు అన్ని సరిగా చేయవమ్మా! అని హెచ్చరించింది.

పురోహితుడు శ్రావ్యమైన కంఠంతో స్వరం తప్పకుండా క్రమంగా షోడశపూజలు చేయిస్తూ అష్టోత్తరం చెప్పినాడు.

ఒక్కొక్క పేరుకు ఒక్కొక్క పుష్పం శ్యామల గౌరమ్మపై ఉంచింది. అష్టోత్తరం ముగిసేవరకు పూజాపీఠం పూవులతో నిండి మనోహరంగా ఒప్పింది.

పూజ ముగిసిన పిమ్మట పురోహితుడు తోరాలు తీసుకొండి అని చెప్పినాడు.

శ్యామల దండ అందుకోబోయింది.

భూదేవమ్మ ఆమెను ఉండవమ్మా! అని వారించి తాను వాని నందుకొని వానిలో నుండి ఒక పిల్లదండను తీసుకొని పరంధామయ్యను పిలిచి ఇది చేతికి కట్టండి అని కుడిచేయి చాపింది.

ఆయన చేతిపై ఒక పూవుంచి దానిపై నుండి దండను కట్టినాడు. ఆమె అతని పాదాలకు నమస్కరించింది.

తరువాత పురోహితుడు శ్యామలతో నోముముడిపై అక్షతలు వేయించి మ్రొక్కించి, దానిని భూదేవమ్మతో శ్యామల కీయమని చెప్పినాడు.

ఆమె గౌరమ్మకు నమస్కరించి నోముముడి తీసుకొని శ్యామలను దోసిలి పట్టుమని అందులో ఉంచి, అమ్మాయ్! ఈ నోముముడిని రేపు గౌరమ్మను ఎత్తుకున్నప్పుడు దండలో గ్రుచ్చి మెడలో వేసుకోవలె. ఇక ఇప్పటినుండి నీవు వ్రతదీక్ష తీసుకొన్నట్టు, దీనిని క్రమం తప్పకుండా ఏటేటా దీపావళినాడు నోముతూ ఉండవలె. ఆ విధంగా యిరవై ఒక్క యేడు మాత్రం తప్పకుండా చేయవలె సుమా! ఆ తరువాత నీ యిష్టం. ఈ వ్రతాన్ని నిలుపుకుంటావో! మానుతావో!... ఇంద, ఈ దండను యిపుడు చేతికి కట్టుకో! అని ఒక చిన్న దండను తీసియిచ్చింది.

శ్యామల దాన్ని కట్టుకొని చిన్నమ్మ పాదాలకు, పినతండ్రి పాదాలకు నమస్కరించింది.

అనంతరం పురోహితుడు ''యానికానిచ పాపాని'' అని ప్రదక్షిణ మంత్రం చెబుతుండగా వారు ఆత్మప్రదక్షిణం చేసి గౌరమ్మకు సాష్టాంగ నమస్కారం చేసినారు.

పూజ ముగిసే వరకు ప్రొద్దు బాగామీరింది. అయినా గౌరికి వేళ వునికి కాలం తెలిసిరాలేదు. వారుత్సాహంగానే ఉన్నారు.

నైవేద్యానంతరం ఆనాడు గూడ భూదేవమ్మ పిల్లలకు తాతయ్య గారి ఇంటిలోనే భోజనం పెట్టింది.

## 22

వ్రతం జరిగిన మూడవనాడు పురోహితుడు మళ్లీ వచ్చి భూదేవమ్మ గారిని పిలిచి కేదారేశ్వర వ్రతకథ వినిపించి సాహిత్యం తీసుకొనివెళ్ళినాడు.

శ్యామల కథవిని ప్రక్కయింటి పేరంటాలను పిలుచుకొని అందరికి పసుపు కుంకుమలిచ్చి మంగళహారతిపాడి గౌరమ్మ నెత్తుకున్నది.

భూదేవమ్మ గౌరమ్మను ఎత్తుకొన్న పిమ్మట నోముముడి గ్రుచ్చి ఆమె మెడలో వేసి ముత్తయిదువలకు అరటిపండ్లు, తమలపాకులు, వక్కలు పంచింది.

అవి అందుకొని పేరంటాళ్ళు వీడ్కోలు తీసుకున్నారు.

భూదేవమ్మ అనాడు గూడ శ్యామలను మళ్ళీ ఆలయానికి తీసుకొని వెళ్ళి దైవదర్శనం చేయించుకొని వచ్చింది.

వారివెంట గౌరి, కేశవుడుగూడ వెళ్ళివచ్చినారు.

ఇల్లు చేరిన పిమ్మట కేశవుడు తాతయ్యా! మన గ్రామం పూర్వం పెద్దక్షేత్ర మన్నావుగదా! మరి దీన్ని ఎవరైనా మహనీయులు దర్శించి నారా? అని అడిగినాడు.

అయ్యో! ఎందుకు దర్శించలేదు? దర్శించే ఉంటారు. అటువంటి వారిలో మొదట చెప్పదగినవాడు చోళవితి శ్రీపర్వతఋషి. ఆయన ఎక్కడివాడో, ఎప్పటివాడో గూడ స్పష్టంగా తెలియదుగాని, రేనాటిలో ఆతని పేరు ధనంజయశర్మ పిమ్మట కనిపిస్తుందట. మన ప్రాంతానికి వచ్చి ఎండవెట్ల భీమేశ్వరాలయాన్ని దర్శించినాడు.

రెండోవాడు శ్రీసమయరవితు. రవితు అనే పేరునుబట్టి ఈయన శ్రీపర్వతఋషికి దాదాపు వాడుకావచ్చు. అంతేగాక పేరునుబట్టి యితడు సమయాచారానికి చెందిన వాడేమో గూడ. ఆదిశంకరాచార్యుడు అదే శాఖకు చెందినవాడు. ఈయన మన తాలూకాలోనే ఉడిమిళ్లలో ఉన్నాడు.

మూడవవాడు ఏకాంతవాసి మహాముని. ఆయన తొమ్మిదవ శతాబ్దంలో మన తాలూకాలోనే మారడుగులో నివసించినాడు. ఏకాంతవాసి అనే పేరునుబట్టి ఆయన గొప్ప తపస్వి అనవలె. ఏకాంతవాసి మహాముని బొమ్మ ఒకటి యిపుడు అలంపురి జోగులాంబాలయంలో గూడ ఉంది. కాని ఇతడగునో కాదో!

నాలుగవవాడు ఓంకారరాశి పండితుడు. ఆయన యమ నియమ స్వాధ్యాయానుష్ఠాన జప తప శీల సంపన్నుడు. విబుధజనసేవ్యుడు, అన్నదాన వినోదుడు. కుసుమాస్త్ర వివర్జితుడు, పంచదీక్షా ప్రతిష్ఠాకరుడు. శరణాగత వజ్రపంజరుడు. మణిరత్న ఖచిత ఉత్తుంగ శ్రీశైల శిఖర సింహాసనారూఢుడు. శ్రీమహేశ్వర దేవర స్థానాధిపతి క్రీ.శ. 1157 లో ఉమామహేశ్వరంలో నివసించినాడు. ఇపుడతని మునిగల్లు గూడ అక్కడ ఉంది.

అయిదవవాడు శుకదేవర. ఈయన క్రీ. శ. 1264 లో అమరాబాదులో ఉన్నాడు. గొప్ప పండితుడు, దానధర్మ ప్రియుడు. తన సమకాలం వారిని ప్రోత్సహించి వారిచేత ఆలయ ప్రతిష్ఠలు దైవప్రతిష్ఠలు చేయించినాడు.

ఆరవవాడు గోపాలస్వామి. ఈయన పదో శతాబ్ది చివరిభాగం వాడు. మంత్రవాద కోలాహల, మకరధ్వజ శారదావల్లీ, మునికులతిలక, జగన్మోహన యోగవిద్యాధర బిరుదాంచితుడు. ఈయిన రంగంపేటలో ఉండేవాడట. ఇతని శిష్యుడు నారాయణస్వాముల మున్ననూరి విజయ గోపాలాలయంలో గరుడకంబ మెత్తించినాడు. వీరందరూ ఒకప్పుడు మన మహేశ్వర మండలంలో (మన తాలూకా) నివసించినవారు.

ఇక కాకతి రెండవ ప్రోలరాజు కాలం నాటి పండితారాధ్యుని శిష్యుడు దోనమయ్య తన భక్తకూటంతో ఈదారినే శ్రీశైలం వెళ్లుతూ ఉమామహేశ్వరంలో నిద్రచేసినాడు. ఓరుగంటి సమీపంలోని మాచిరాజు పల్లె నివాసి పండితారాధ్యుని గృహదాసుడైన విభూతిగౌరయ్య ఈ ప్రాంతమంతా సంచరించి మన గ్రామమేగాక గోదలు రామగిరి, ఎండవెట్ల, కలువకొలను మొదలైన గ్రామాలన్నీ దర్శించినాడు. ఆయన తమిళ కన్నడాంధ్ర సంస్కృతాలలో పండితుడు.

ఏకాలంవాడో ఎక్కడివాడో తెలియదుగాని "చోళరాజ ఒడయరు" ఒకాయన ఉమామహేశ్వరాన్ని దర్శించి వెళ్లినాడు. ఇంకా ఎంవరెందరు ఈ ప్రాంతంలో వర్ధిల్లినారో, ఈ ప్రాంతానికి వచ్చి యిక్కడి క్షేత్రాలను దర్శించి వెళ్లినారో చెప్పలేము. ఎందరో మహానుభావులు అని త్యాగరాజు గారు కీర్తించినారు. కనుక అట్టివారిలో మన గ్రామాన్నిగూడ ఎందరో దర్శించే ఉంటారు.

పరంధామయ్యగారి మాటలు విన్నతరువాత గౌరి, తాతయ్యా! మన ఊరు పూర్వం అంతవైభవంగా ఉన్నది గదా! మరి ఆలయం శిఖరం పడిపోయి యిపుడిట్లా అయిందే? అని అడిగింది.

అదంతా దుండగుల పని అమ్మా! అన్నాడాయన.

ఎవరా దుండగులు- అడిగినాడు కేశవుడు.

చెప్పటానికి వీలులేమలే! కులానికి కులమే చేటు, మనలోనే ఒక మతం మరొక మతాన్ని దెబ్బతీసింది.

ఏలాగ తాతయ్యా! అన్నది గౌరి.

పదకొండవ శతాబ్దంలో కన్నడ దేశంలో బసవేశ్వరుడు అనే "ప్రవక్త" ఒకాయన పుట్టి, శైవమతంలో "వీరశైవం" అనే ఒక శాఖను పైకితెచ్చినాడు. ఆయనకు చాలామంది శిష్యులున్నారు. వారిలో పండితా రాధ్యుడు ఒకడు. ఆయన అచ్చమైన తెలుగువాడు, బ్రాహ్మణుడు. "పండితత్రయం" అని పేరుచెందినవారిలో ఒకడు. ఆయన బసవేశ్వరుని మతంచే ప్రభావితమైనాడు గాని ఆయనను ఎప్పుడూ చూడలేదు. కాబట్టి చూడవలెనని ఉవ్విళ్లూరుతూ ఒక పర్యాయం బయలుదేరి పానుగంటి మీదుగా వచ్చినాడు. అపుడు ఆ పట్టణాన్ని ఉదయనుడు అనేరాజు పాలిస్తు న్నాడు. ఆ రాజు సభలో బౌద్ధ పండితులకు ఈ పండితునికి వాదం

జరిగింది. పండితుడు వారిని ఓడించి, వారిపక్షం వహించినందుకు రాజును శపించి బయలుదేరినాడు.

అపుడు బసవేశ్వరుడు కూడలి సంగమంలో ఉన్నాడు. పండితుడు ఆయనను చూడటానికి వస్తున్నాడు. అపుడాయన వెంట వనిపురి శంకరయ్య, గంగాపురం బసవయ్య, వెల్లగొండ మహాదేవన్న, మియ్యాపురం సత్తెక్క మొదలైన వారంతా ఉన్నారు. ఆయనను దారిలో వనిపురి శంకరయ్య తమ యింట నిలుపుకొని అతిథ్య మిచ్చినాడు.

ఆయన అక్కడ ఉండగానే బసవేశ్వరుడు లింగైక్య మందినట్లు తెలిసింది. అది విని ఆయన మిక్కిలి విలపించి నిరుత్సాహపడిపోయి అక్కడినుండి తనవెంట ఉండేవారిని దోనమయ్య నిచ్చి శ్రీశైలం పంపి, తాను వెళ్లి వెల్లగొండలో నిలిచినాడు.

అప్పటికి మన సంఘంలో జైనమతం బాగా వ్యాప్తిలో ఉండేది. శైవులకు జైనంఅంటే శివునికి మొగిలిపూవులాగ పడేదికాదు. అందువల్ల పండితునితో క్రొత్తగా దీక్షను పొందిన శిష్యులంతా మన ప్రాంతంలో గూడ ఎందరో జైనులను చంపి, వారి ఆలయాలన్నీ శివాలయాలుగా మార్చినారు. జైనవిగ్రహాలను తీసివేసి శివప్రతిష్టలు చేసినారు.

ఇపుడు గోదలు చెఱువుకట్టపై, రామగిరి గుట్టపై, ఇంద్రకల్లు పట్టణంలోను ఉన్నవన్నీ మొదట జినాలయాలే. మన గ్రామ సమీపంలో మొదట నాగమ్మపల్లె ఉండేదనిఅని చెప్పినారుగదా! అక్కడగూడ ఒక జినాలయం ఉండేది. అటువంటి వాసినెల్ల నాశనం చేయటమేగాక వారు అనేకమైన నూతన శివప్రతిష్ఠలు, తమ గురువులవారి పేర మల్లికార్జున ప్రతిష్ఠలు గూడ చేసినారు.

శివప్రీతిగా వారెంతటి త్యాగానికైనా సిద్ధపడేవారు.

మొలకు కాసె, తలపై పెద్దసిగ, నొసట విబూదిరేకలు, మెడకు చేతులకు రుద్రాక్షదండలు, చేతిలో శూలం, బాణం, గొడ్డలి, కత్తి మొదలైన ఏదోఒక ఆయుధం, ఇదీ ఆనాటి శివలెంకల వేషం. ఈనాడు మనకీ లక్షణాలుండే వీరగల్లులు గ్రామాలలో అక్కడ కనిపిస్తవి. కాబట్టి దాన్ని బట్టి ఆనాడామతం ఎంతవ్యాప్తిని పొందిఉండేదో ఊహించవచ్చు.

అటువంటి బొమ్మలు చెక్కిన రాళ్లు మనఊరిలోగూడా ఉన్నాయి తాతయ్యా ! అన్నాడు కేశవుడు.

# 23

అదివిన్న తరువాత గౌరి, తాతయ్యా! అయితే మన ఊరి ఆలయాన్నిగూడా వారే కూలగొట్టినారా ? అనిఅడిగింది.

మన ఊరి ఆలయాన్ని వారుగాదులే ! రాజుల కాలంలో మన ప్రాంత మంతా దేవరకొండ రాజ్యంక్రింద ఉండేది. ఆ రాజ్యంపై బిజాపుర సుల్తానులకు కన్నుపడింది. వారెన్ని తడవలు దండెత్తినా ఆ ప్రభువులు లొంగలేదు అపుడు వారు ఢిల్లీసుల్తానును సహాయం కోరగా అతడు రెండువందలమంది అశ్వికదళం, ఆరువేలమంది కాల్బలాన్ని యిచ్చి ''అమీర్ జాదా మహిబుల్లా'' అనే సేనానిని సహాయంగాపంపి అతనితో తెలంగాణాలోని కోటలన్నీ జయించమని ఆజ్ఞయిచ్చినాడు.

ఆనాడు మహమ్మదీయులు హిందువులపై చేసిన యుద్ధాలకు ''జహాద్'' అని పేరు. అంటే మతయుద్ధమని అర్థం. వారా యుద్ధాలలో హిందువులను చంపటం, వారి ఆలయాలు కూలగొట్టడం లక్ష్యంగా పెట్టుకున్నారు.

వారెక్కడైనా కోటను పట్టుకోగానే మొదట సరాసరిగా దానిలోపలికి వెళ్లి దోచుకొని ఆతరువాత అక్కడ ఉండే ఆలయ శిఖరాన్ని కూల

ద్రోసి మూలవిగ్రహాన్ని ముక్కలుచేసి అక్కడకూడా ఏమైనా ద్రవ్యం ఉంటే తీసికొని ఎదురుతిరిగిన వారిని కత్తికెరజేసి వెళ్ళేవారు.

అటువంటి దండయాత్ర మన ఊరిపై గూడ జరిగింది.

ఈ గ్రామంలో దొరలున్నారని చెప్పినానుగదా! పైగా వారు దేవర కొండవారు తెచ్చి నిలిపిన వారే కాబట్టి వారిపైకి దండు వస్తుందని పూజా ర్లకు ఎలాగో తెలిసింది. వారిపైకి వచ్చిన వారాలయాన్ని గూడ పాడు చేయక మానరని తెలుసు. అందుచేత ఎలాగైనా తమ స్వామిని రక్షించు కోవాలని తాపత్రయపడ్డారు.

అంతవరకక్కడ ఆక్కడ జరిగిన దురాగతాలు గూడా విన్నారు గాబట్టి స్వామిని కాపాడుకునే అందుకు ఒక ఉపాయం ఆలోచించినారు.

అప్పటికి మన ఊరిలోని గర్భాలయం గోయిగానే ఉండేది. దానిపై పూజారుల శివలింగం కొంతమాత్రం కనిపించేఅట్లు చుట్టూ రాతి కడ్డీలు కప్పి ఒక సామాన్యమైన రాతిలో సోమసూత్రం ఒకటి తొలిపించి దండు సమీపిస్తుండగా దానిరోలు శివలింగంపైకి చేసి బోర్లించి పూజా రులు ఆలయాన్ని విడిచి వెళ్ళిపోయినారు. వారు వెళ్ళిన పిమ్మట ఊరిపై తురకలదండు పడింది. కోటలో ఉండేవారు పారిపోయి ప్రాణాలు కాపాడు కున్నారు.

తురకలు కోటను దోచుకొని ఆలయంపైబడి దాని శిఖరాలు రెండు కూలద్రోసి లోపలికి వచ్చినారు. అక్కడ శివలింగం కనిపించలేదు. బోడిగా ఉండే సోమసూత్రం మాత్రమే కనిపించింది. ఎదురుగా ఉండే నందీశ్వరుడు ప్రక్కగా ఉండే ఆలయంలో చెన్నకేశవుడు మాత్రం కని పించినాడు.

ఆలయంలో వారు శివుడు కనిపించక పోవటంచేత కనిపించిన నందిని, చెన్నకేశవుని నడుం విరుగగొట్టి వెళ్ళినారు.

ఇక్కడనేగాదు వాళావిధంగా చాలా చోటుల్లో చేసినారు. అపుడు పూజారులు తమ దైవాలను రక్షించుకోవటానికి పడిన పాట్లు చెప్పలేం. వారిని మట్టిలో పూడ్చి, సొంత యిండ్లలో దాచి, గ్రామాలకు తరలించి ఇంకా ఎన్నెన్నో పాటుల బడినారు.

అది హిందువుల కొక దుర్దినం. "కుంజర యూథంబు దోమ కుత్తుక సొచ్చెన్" అంటే ఇటువంటిదే. తమను రక్షించే దైవాన్నే తాము రక్షించుకోవలసి వచ్చింది. "ధర్మో రక్షతి రక్షితః" అని గదా!

తురకలు తమ నిర్వాహకమంతా చేసి వెళ్లిన పిమ్మట పూజారులు మళ్ళీ ఆలయంలోనికి వచ్చి స్వామిపై బోర్లించిన సోమసూత్రం తీసి ఎదురుగా గోడకానించి మళ్ళీ పూజా పునస్కారాలారంభించుకొన్నారు. విరిగిన నందికి బదులుగా మరొకదాన్ని నిలుపుకొన్నారు.

ఇపుడు మీరు మన ఆలయంలో ఆ సోమసూత్రం చూడవచ్చు అన్నాడు పరంధామయ్య.

అవును ఉన్నది చూచినాము అన్నారు వారు.

మన ఊరిలో ఆలయం బాగున్న దినాలలో ఉత్సవం ఏదైనా జరిగేదా? అని అడిగినాడు కేశవుడు.

ఎందుకు జరుగలేదు? మాఘంలో బ్రహ్మోత్సవం నడిచేది. అంతే గాక ఈ స్వామికి వ్యక్తిగతంగా గూడా ఎందరో బిల్వార్చనలు, కుంకుమార్చనలు చేయించినారు.

మన గ్రామంలో ఉండే దుర్గివారు అనే బ్రాహ్మణులు ఈ స్వామికి అనన్యమైన భక్తులు. దుర్గి యిపుడు పలనాడులోని గ్రామం. అక్కడొక శిల్పారామం గూడా ఉంది. ఆ శిల్పశాలలో పూజామూర్తులెన్నో సిద్ధమౌతుంటవి. దుర్గి వారక్కడ నుండి తెలంగాణా ప్రాంతానికి ఎప్పుడువచ్చి

నారో తెలియదు కాని, ఆ వంశంలో మంచి విద్యావంతులు, నిష్ఠాపరులు, భక్తిపరులు ఉన్నారు.

గత శతాబ్దంలో ఈ గ్రామంలో ఆ వంశంలో నృసింహావధాని అనే ఆయన ఉన్నాడు. ఆయన మంచి పురాణీకుడు. ఈ గ్రామంలో బంధంవారింటిలో, అచ్చంపేటలో గూడవల్లివారింటిలో భారతం, భాగవతం పురాణాలు చెప్పేవాడు. వాటికంటే ఆయన శేషధర్మాలు చెప్పటంలో దిట్ట.

ఒకరిచేతి అన్నం తినకుండా నియమ నిష్ఠాపరుడై స్వపాకంతో జీవించినాడు. ఆయన మన ఆలయంలోని స్వామికి స్వయంగా మూడు తడవలు బిల్వార్చనలు చేసినాడు.

# 24

పరంధామయ్య చెప్పింది అంతా విన్న తరువాత కేశవుడు తాతయ్యా! మరి మన గ్రామానికి యింత పెద్దకథ ఉందే! ఇక్కడ ఎవరూ కవులు లేకున్నారా? దీన్ని వ్రాయలేదా? అని అడిగినాడు.

కవులు లేకేం! చెప్పదగిన వారిద్దరున్నారు, వారిలో మొదటివాడు అల్లాడి వెంకట నరసింహశాస్త్రిగారు, శాస్త్రిగారి తండ్రి లక్ష్మణశాస్త్రి. తల్లి అంబమ్మగారు. వారు శ్రీవత్సస గోత్రులు.

శాస్త్రిగారికి విద్యాగురువు కలువకుర్తి నారాయణాధ్వరిగారు, అధ్వరిగారు, తాడూరు భోగలింగ చయనుల వారిచేత పూర్ణదీక్షను పొంది రామానంద యతీశ్వరులను పేర తురీయాశ్రమం స్వీకరించినారు. వారు సంగీత సాహిత్యాలలో మంచి దిట్టలు, కంఠం శ్రావ్యంగా

ఉండి హరికథలు గూడా చెప్పేవారు. వారికి శాస్త్రిగారిపై మిక్కిలి అభిమానం గూడ ఉండేది. ఎక్కడైనా తాను కథాకాలక్షేపం చేయవలసి వస్తే అక్కడికి శాస్త్రిగారు ఒకవేళ వెళ్ళితే అధ్వరిగారు బంగారు శాస్త్రి వచ్చినాడు, ఇక నేను చెప్ప నవసరం లేదు అని తప్పుకునే వాడట.

శాస్త్రిగారి కాలంలో మన ఊరిదగ్గరి రంగంపేటలో "గుడిమంచి" వారు అనే వారుండేవారు. ఆ వంశంలోని అంబయ్య అనే ఆయనకు పురుష సంతానం లేదు. శాస్త్రిగారిని ఇల్లిటం తీసికొని తన కూతురు రాఘవమ్మ నిచ్చి వివాహం చేసినాడు. అయితే వారికి గూడ సంతానం కలుగలేదు.

ఔరస సంతానం లేకున్నా శాస్త్రిగారికి కృతి సంతానానికి మాత్రం లోటు లేదు. ఆయనగారి కాలంలో అచ్చంపేటలో బాలాసాని అనే వేశ్య ఉండేది. ఆమెది పెద్ద మేళం. శాస్త్రిగారు మంచి రసికుడు. ఆమె మేళానికి ఎన్నో యక్షగానాలు వ్రాసి యిచ్చినాడు. అపుడపుడు తన యక్షగానాలలో తానే నాయక పాత్రలుగూడ ధరించేవాడు.

యక్షగానాలేకాక ఆయన మరెన్నో పాటలు, ప్రబంధాలు గూడ రచించినాడు. ఆ కాలంలో కొండారెడ్డిపల్లెలో రాఘవరావు గారనే మక్తేదారుగారున్నాడు. ఆయన ఏటేటా సప్తాహాలు చేసేవాడు. శాస్త్రిగారి ప్రతిభను గుర్తించి తమ గ్రామానికి కొనివెళ్ళి నిలుపుకొని ఆదరించి క్రీ.శ. 1878 చిత్రభాను సంవత్సర వైశాఖంలో వారిచేత "సప్తాహమాహాత్మ్యం" అనే చక్కని ప్రబంధాన్ని వ్రాయించినాడు.

"నిరాశ్రయే నశోభంతి కవితా వనితా లతా" అని ఆర్యులన్నారు. ఆశ్రయం లేకపోతే ఆడదిగాని, పూలతీగగాని, కవిత్వంగాని శోభించవట. శాస్త్రిగారి ప్రతిభను కొండారెడ్డిపల్లె రాఘవరావు గుర్తించినారు గాబట్టి వారు చేసిన సప్తాహాలపై సప్తాహమాహాత్మ్యం పుట్టిందిగాని గ్రామస్థులెవరూ

గుర్తించలేదు కాబట్టి దానివలె కేదారేశ్వర మహాత్మ్యం పుట్టలేదు. ఈ ఊరిపై కేవలం కొన్ని కీర్తనలు మాత్రమే వారి రచనలుగా మిగిలి పోయినవి.

శాస్త్రిగారు కేవలం కవి మాత్రుడేగాదు, గొప్ప ఉపాసకుడు. చక్కని ఆధ్యాత్మికవేత్త అని గూడా అంటారు. ఒకనాడాయన గుఱ్ఱాన్ని ఎక్కి ఏదో గ్రామానికి వెళ్ళుతుండగా దారిలో కొందరు దొంగలాయనపై బడినారట. అపుడు ఆయన దగ్గర ఏమీ లేకున్నది. చేతికి ఒక ఉంగరం మాత్రం ఉండేది. అందుచేత ఆయన గుఱ్ఱందిగి వారితో 'ఒరేయి' ఇపుడు నాదగ్గర ఈ ఉంగరంతప్ప మరింకేమీలేదు. మీరు అనవసరంగా నాపై ఎందుకు పడుతారు! ఈ రాత్రి మరెక్కడికేనా వెళ్ళండి. పుష్కలమైన ధనం దొరుకుతుంది పొండి!'' అన్నాడట.

వారికేలాగో ఆయన మాటపై గురి నిలిచి వదిలిపెట్టి వెళ్ళగా ఆ రాత్రి నిజంగానే వారికి చాలా ధనం దొరికింది. అందుకు వారు సంతో షించి మూడోనాడు దారిగాచి ఆయనను కనిపించుకొని భక్తితో దండం పెట్టి తమకు దొరికిన దానిలో కొంతభాగం తీసికొమ్మన్నారు. అపుడాయన దానికి యిష్టపడక, ఇది నాకెందుకు! మీరే ఏదైనా ధర్మకార్యానికి ఇవ్వండి! వెళ్ళండి! అని పంపినాడు.

శాస్త్రిగారి శిష్యుడు అచ్చంపేట నరసింగయ్య శాస్త్రిగారు. ఆయన కాశీలో కమలాపతి త్రిపాఠీ తాతగారి దగ్గర వ్యాకరణం చదువుకున్నాడు. ఆ కాలంలో ఒకనాడు ఆయనకు కాలుకు ఎనుపతేలు కరిచింది. అందుల కాయన తనవారెవరూ లేని పరాయి దేశంగదా! ఏమవుతుందోనని భయ పడ్డాడు. అపుడు ఆ రాత్రి నరసింగయ్య గారికి కలలో శాస్త్రిగారు కని పించి అబ్బాయ్! నీవు భయపడ నక్కరలేదు. ఎనుపతేలు అంటే ''కాల భైరవుని వాహనం'' కాబట్టి అది కరవటం అంటే నీపై కాలభైరవుని

అనుగ్రహం కలిగినట్టు, అని చెప్పి ఏదో ఒక చెట్టును చూపి, దాని పసరు కరిచిన చోట పూయమన్నాడు.

నరసింగయ్య గారికి అక్కడ కొన్ని దినాలకు మరొకసారి గూడ ఎనుపతేలు కరిచింది. అపుడు గూడ ఆయనకు మొదటివలెనే శాస్త్రిగారు కలలో కనిపించి, భయపడవద్దు అని చెప్పినాడు. దానితో ఆయన యిల్లు చేరిన తరువాత శాస్త్రిగారిని గురువుగా అంగీకరించి, తన పాండురంగ పూజా విధానంలో నుతించినాడు. ఆకాలంలో ఈపరంపరలోని వారంతా ఈ ప్రాంతంలో బాగా పేరు చెందినవారు.

మన గ్రామంలో ఉన్న రెండవ కవి ఎవరు యిక ? అని అడిగింది గౌరి. ఇక్కడఉన్న రెండవకవి దూదేకుల దాదేసాహేబు. ఆయనకూ్కడా ఒక కథ ఉంది అన్నాడు పరంధామయ్య.

అదికూడా చెప్పండి ! అన్నది గౌరి.

దాదేసాహేబుది నల్లగొండ జిల్లాలోని పాలువాయి గ్రామం. అతడు చిన్నపుడు అల్లరి చిల్లరిగా తిరిగేవాడు. అలా ఉండగా అతనిని తండ్రి ఒక కమ్మరి దగ్గర జీతం ఉంచినాడు.

దాదేసాబు బాగా నిద్రపోతు సోమరిగా ఉండేవాడు. కమ్మరి దగ్గర నిరంతరం కొలిమి తిత్తులు వత్తవలసిన పని ఉండేది. దాదేసాబు ఆ తిత్తులపైని కూర్చొని ఆలాగే నిద్రపోయేవాడు. కమ్మరి ఎన్ని తడవలు మందలించినా దారికిరాలేదు. ఒకనాడు పని కస్తిగా ఉన్నది. దాదేసాబు తిత్తులపై కూర్చొని కునుకుతున్నాడు. అపుడు కమ్మరికి చెప్పలేని కోపం వచ్చి లేచి దాదేసాబును అక్కడనే దాతిదగ్గర ఉండే గుంజకు కట్టివేసి వేడివేడి సటికంతో రెండంటించినాడు. దానితో అతని మబ్బు వదిలి తెలువు లంకించుకున్నాడు. ఆవిధంగా ఎంతసేపేడ్చినాడో తెలియదు,

ఆ ఏడుపులోనే మరొకతడవ మబ్బు క్రమ్మింది. ఆ మబ్బులో ఒక తెల్లని చీర కట్టుకున్న యువతి వచ్చి తనను ఓదార్చిందట. దానితో అతడు కన్నులు తెరిచి చూచినాడు.

ఎదుట కమ్మరి జోరుగా తన పని చేస్తూనే ఉన్నాడు. అప్పుడు దేశంపై ప్లేగు వ్యాపించే కాలం. అక్కడక్కడ ఎలుకలు పడి గ్రామస్థులంతా యిండ్లు విడిచిపెట్టి పొలాలలోనికి పోతున్నారు.

దాదేసాబు గుంజకు కట్టివేయబడి నిలిచినవాడు అలాగే

భుజగభూషణ పిలకు భీమారి, వినవయ్యా తెలిపెద.

వీరభోజ వసంతయాచారి!

అనుదినం బనకుండ సద్గురు నాత్మదలచని మనుజులందరు

సతిసుతుల నెడబాసి అడవిని దుర్దశలు బొందుచు దిరిగిరయ్యా.

భుజగభూషణ పిలకు బీమారి! అని తమ యజమానిని సంబోధించి పాడటం మొదలుపెట్టినాడు.

అదివిని అక్కడుండే వారంతా విస్తుపోయినారు. వీరభోజయ్యాచారి లేచి అతనికట్లు విప్పి, వీడేదో నివురుగప్పిన నిప్పు అని అబ్బుర పడినాడు.

ఆనాటితో యిక దాదేసాబు స్వతంత్రుడై దేశ సంచారం చేసినాడు. ఆకాలంలో దాదేసాబు వంశీయులంతా బాణాసంచా కట్టి జీవించేవారు కాబట్టి అతనికి దానిలో మంచి నైపుణ్యం ఉండేది.

బాణాసంచాకు "సోరుప్పు" ప్రధాన ద్రవ్యం. అది మన ఊరిలో పూర్వం బాగా దొరికేది కాబట్టి చివరి దినాలలో అతడు వచ్చి మన గ్రామంలోనే స్థిరపడి పోయినాడు.

దాదేసాబు దేశికవి. అతని కవిత్వం కాకర పువ్వొత్తుల లాగే చుర చుర లాడుతూ ఆనాటి సమాజానికి దర్పణం పడుతుంది. సమాజంపై, సమకాలీన ప్రజల ఆగడాలపై అతనిపాటలు చాలా ఉన్నవి. కాని అతడు గూడ యిక్కడి దేవునిపై ఏదీ వ్రాయలేదు.

# 25

పరంధామయ్యగారు దాదెసాబును గురించి చెప్పినపిమ్మట కేశవు డాయనతో, తాతయ్యా! కవులెవరూ మన దేవునిపై వ్రాయలేదుగాని ఆవిధంగా వ్రాస్తే వ్రాసిన వారికిగాని, వ్రాయించిన వారికిగాని ఏమైనా ఫలముందా? అని అడిగినాడు.

అయ్యో! ఎందుకుండదు? ప్రతిపనికి ఏదో ఒక ఫలం ఉండి తీరు తుంది. ఆఫలితాన్ని—

కర్తా కారయితాశ్చైవ ప్రేరకశ్చా నుమోదకః
సుకృతే దుష్కృతేచైవ చత్వార స్సమభాగినః.

చేసినవాడు, చేయించినవాడు, చేయించినామని చెప్పినవాడు, అది చేసి నందుకు సంతోషించినవాడు ఈ నలుగురు ఫలితాన్ని సమంగా అనుభ విస్తారు అని పంచతంత్రం చెబుతుంది.

మరొకటి- మన దేశంలో హిందువై పుట్టినవానికి ఈ లోకమే శాశ్వతంగాదు. అతనికి పరలోకం ఒకటుంది కాబట్టి బ్రతికినంత కాలం ఈ లోకసుఖంకొఱకు ఏవిధంగా పాటుపడుతాడో అదే విధంగా మరణా నంతరం ఆ లోకంలో సుఖం కలిగే అందుకు గూడా కొన్ని పనులు చేస్తుంటాడు. మనం చేసే దానధర్మాలు, పూజా పురస్కారాలు ఆ కోవకు చెందుతుంటవి.

హిందువుకేమో పునర్జన్మపై విశ్వాసముంది కాని తక్కినవారికి అది ఉన్నా లేకున్నా పరలోక విశ్వాసం, అక్కడ జీవునికి కష్టసుఖాలు కలిగే విశ్వాసం ఉంది.

ఇక పరలోకంలో ఈ జీవునికి ఎంతవరకు స్థానముంటుంది అనే ప్రశ్నకు భూలోకంలో అతని పేరెంతవరకు నిలిస్తే అంతవరకుంటుందని మన పురాణాలు చెప్పుతవి.

పూర్వం ఇంద్రద్యుమ్నుడు అనే రాజున్నాడు. ఆయన చాలా యజ్ఞాలు, ఇంకా అనేకమైన ధర్మకార్యాలు చేసి మరణించిన పిమ్మట స్వర్గానికి వెళ్ళి చాలాకాలం ఉన్నాడు. ఆవిధంగా ఉండగా ఒకనాడు దేవదూతలు వచ్చి, యిక నీకు యిక్కడ ఉండవలసిన కాలం చెల్లిపోయింది వెళ్ళమన్నారు. అది విని ఆయన అబ్బురపడి, అయ్యో! నేనుచేసిన పుణ్య కార్యాల లెక్కప్రకారం యింకా చాలా దినాలు నేనిక్కడ ఉండవలసి ఉంది అని చెప్పినాడు. అది విని వారు, అయితే నీవు భూలోకం వెళ్ళి ఎవరికైనా జ్ఞాపకం ఉన్నావో లేవో తెలిసికొనిరా! ఆవిధంగా ఉన్నట్లయితే నీకిక్కడ స్థానం ఉంటుంది అన్నారు. అపుడాయన భూలోకానికి వచ్చినాడు. అది చాలా మారిపోయింది. అక్కడ తనను గుర్తు పట్టేవారెవరూ లేరు. ఆయన మార్కండేయుడు చిరంజీవి, అనేక యుగాలు బ్రతికినాడని విని అతని దగ్గరకు వెళ్ళి నమస్కరించి, స్వామీ! మీరు భూలోకంలో ఎప్పుడైనా ఇంద్రద్యుమ్న మహారాజు ఉన్నట్లు విన్నారా? అని అడిగినాడు. అది విని ఏమో నాకు జ్ఞాపకం లేదు. వింధ్యపర్వతంపై ఒక చెట్టు తొఱ్ఱలో నాకంటె పెద్దవాడైన "ప్రావారకర్ణుడు" అను "గుడ్లగూబ" ఉన్నాడు. అతని నడుగుదాము రండి అని అచ్చటికి తీసికొనివెళ్ళినాడు. అపుడా గూబరాజు యింద్ర్యదుమ్నుని పేరువిని, ఏమో నేనుగూడ వినలేదు, హిమాలయ సమీపంలో ఒక మఱ్ఱిచెట్టుపై నాకంటె పెద్దవాడైన "నాళీకజంఘుడు"

అను కొంగరాజున్నాడు. అతనినడుగుదాము రండి అని అచటికి గొని వెళ్ళింది.

నాళీకజంఘుడు బ్రహ్మకు మిత్రుడు. అతనికి "రాజధర్మడ"ని మరో పేరు. అతడు ఇంద్రద్యుమ్నుని పేరువిని, ఏమో నేనుగూడ ఎరుగను, ఇక్కడికి కొంతదూరంలో ఒక సరస్సున నాకంటె పెద్దవాడైన "అకూపారుడు" అనే కూర్మ రాజున్నాడు, అతని నడుగుదాము రండి అని తీసికొని వెళ్ళింది. ఒక్కొక్కరు ఆవిధంగా నాకు తెలియదు, నాకు తెలియదు అని తనను ఒక చోటినుండి మరొక చోటికి తీసుకు వెళ్లుతుంటే ఇంద్రద్యుమ్నుని ఉత్సాహం క్రమంగా నశిస్తూ దీనముఖంపడింది. అంతలో వారు సరస్సుదగ్గరకు చేరుకున్నారు. అపుడు నాళీకజంఘుడు పిలువగా ఆకూపారుడు బయటికివచ్చినాడు. అపుడతనిని చూచి ఇంద్రద్యుమ్నుడు తనను గుఱించి అడుగగా, ఆ కూర్మరాజు ఓ రాజా! నేను నిన్ను గుర్తుపడతాను, నన్ను చాలా సారులు కాపాడినావు. చాలా యజ్ఞాలు చేసినావు. ఆ నాడు నీవు దానంచేసే గోవులన్ని ఇక్కడ దొడ్డికట్టి ఉండేవి. వాటి త్రొక్కుడు చేతనే ఈ సరస్సు ఏర్పడింది, అని చెప్పింది. అది వినగానే ఇంద్రద్యుమ్నుని వెంట అదృశ్యరూపంలో వస్తున్న దేవదూతలు అతనికి ప్రత్యక్షమై, నీకింకా స్వర్గంలో చాలాదినాలు స్థానం ఉంది రమ్మని తీసికొని వెళ్లినారు. కాబట్టి భూలోకంలో మనపేరు ఎంతవరకు నిలచిఉంటే అంత వరకు మనకు స్వర్గంలో చోటు ఉంటుంది. అందుకొరకని పూర్వులు సప్త సంతానాలు ఏర్పాటు చేసినారు.

సప్త సంతానాలు ఏమిటి తాతయ్యా! అని అడిగింది గౌరి.

సత్రం కట్టించటం, లేదా పెట్టించటం, చెఱువు వేయించటం, లేదా పుష్కరిణులు త్రవ్వించటం, కావ్యం వ్రాయటం, లేదా వ్రాయించటం, భావితరాలకొఱకు ఉపయోగపడేవాటిని పాతరలలో నిలువ చేయటం, గుడి

కట్టించటం, తోటలు వేయించటం, బ్రాహ్మణులను గ్రామాలలో నిలపటం, లేదా వారికి అగ్రహారాలీయటం, ఇవి సప్తసంతానాలు. వీనివల్ల అవి చేసిన వారి పేరు శాశ్వతంగా నిలుస్తుంది. అయితే గువ్వల చెన్నడు పైవానిలో.

గుడిపడును, నూయిపూడును,
వడి నీళ్లకు చెఱువు దెగును వనములు ఖిలమౌ
చెడనిది పద్యము సుమ్మీ

కుడి యెడమలు చూడకన్న గువ్వలచెన్నా! అంటాడు. మనం కట్టించిన గుడి కొంతకాలానికి కూలిపోవచ్చు. బావి పూడిపోవచ్చు. చెరువు తెగిపోవచ్చు, తోట చచ్చిపోవచ్చు గాని కావ్యంమాత్రం ఆవిధంగా కాదు కాబట్టి దాన్ని వ్రాసేఅందుకు లేదా వ్రాయించే అందుకు వెనకా ముందు ఆలోచించ వద్దు అంటారు. నిజానికి గూడ సంతానాలన్నిటిలో కావ్యం అక్షర రూపమయింది గాబట్టి అన్నిటికంటే అదే చాలా కాలం నిలిచే అవకాశం గూడా ఉంది. కాని ఈ సత్యం చాలామందికి తెలియదు. ఒకచోట గుడి కట్టుతున్నారు, లేదా ఒక సత్రం కడుతున్నారు అంటే భూరిదానం యిచ్చే దాతలెందరో ఒక కవిగారి పుస్తకాన్ని అచ్చు వేయించ టానికి వెనకాడుతారు.

గుడిలాగా పుస్తకం అందరికీ కనిపించదుగదా తాతయ్యా! అది ఎక్కడో మూలపడి ఉంటుంది అన్నాడు కేశవుడు.

నిజమేరా! నీవన్నట్టు చాలామంది దృష్టిలో పుస్తకం మూల పదార్థమే- శ్రీనాథ మహాకవి కాశీఖండంలో-

శ్వేతపక్షంబు లోపల బెరుగు నెట్లు
దిన దినంబును నీహార దీప్తిదీప్తి
అవ్విధంబున బెరుగు నిత్యాభి వృద్ధి
పంట పంటకు భూదాన ధర్మ ఫలము,

అని చెప్పినాడు. భూదానం చేసిన వానికి దానిపుణ్యం శుక్లపక్షంలో చంద్రుని కళలు పెరిగినట్లు పంటపంటకు పెరుగుతుందట. ఆ విధంగానే బావులు, సత్రాలు గూడా అంతే. అవి ఎంత ప్రజోపయోగకరంగా ఉంటే వానిఫలితం కర్తకు అంతగా పెరుగుతుంది. ఇదే విధంగా పుస్తకం గూడ. భవభూతి మహాకవి ఉత్తరరామ చరిత్రలో-

''కాలోహ్యాయం నిరవధిః విపులాచ పృథ్వీ'' అన్నాడు. అంటే కాలం అనంత మయింది. ప్రపంచం విశాల మయింది అని అర్థం. ఈ సూక్తి సప్త సంతానాలలో డేనికి వర్తించినా లేకున్నా పుస్తకానికి మాత్రం తప్పక వర్తిస్తుంది.

అక్షరబద్ధమైన రచనలు దేశంలో ఎక్కడనో ఒకచోట సురక్షితంగా ఉండక పోవు కాబట్టి అనంతమైన కాలంలో ఎప్పుడో ఎక్కడనో పరిశోధకులు పుడుతూనే ఉంటారు. అటువంటి వాటిని బయట పెడుతు వానికి పునర్జన్మ నిస్తూనే ఉంటారు.

నిజమే తాతయ్యా! మా తెలుగు మేష్టారు గూడ అపుడపుడు పుస్తకాలను గురించి చెపుతుంటాడు అన్నది గౌరి.

గౌరీ!

గడుసరి లోభి విత్తమది కన్నపు దొంగకు బందెకానికిన్,

పుడమి విలాస రీతులకు భూపతికిం జను

అని అన్నట్టు ఈనాటి పరిభాషలో చెప్పవలసివస్తే యిప్పటి వారి డబ్బులు, సినిమాలకు, హోటళ్లకు, ఫ్యాన్సీ షాపులకు, పానశాలలకు, జూదశాలలకు పోతుంటవి కాబట్టి అటువంటివి మానుకొని మంచి పుస్తకాలు కొనటం, చదవటం అలవాటు చేసికోవలె. మంచి పుస్తకం మనకు మరో మిత్రుడు అంటారు. ఇక వాటిని కృతి తీసుకోవటం, అచ్చు వేయించటం, ఆపై శక్తి మాట, అన్నాడతడు.

# 26

పరంధామయ్యగారు తనమాట ముగించగానే కేశవుడు, తాతయ్యా! మరి ఈ పుస్తకాన్ని ఎవరు వ్రాసినారు- ఎవరు వ్రాయించినారు? అని అడిగినాడు.

దీనినే అంటున్నావా! ఇది ఈ తాలూకా వాడే, జినకుంట గ్రామస్థుడైన కపిలవాయి లింగమూర్తిగారు వ్రాసినారు. మన గ్రామస్థుడైన బంధం బాలనారాయణగారు వ్రాయించినారు.

అయితే ఆయనెందుకు వ్రాయించినట్టు? అన్నది గౌరి.

గౌరీ! లోకంలో అన్ని పనులకు కారణాలు కనిపించవు. సజ్జనులు ఎవరికైనా అకారణ మిత్రులే అయినట్లు సత్కార్యాలు గూడా అకారణంగా జరుగుతుంటవి. వారి వారి పూర్వ సుకృతాన్నిబట్టి వారికి అటువంటి బుద్ధి పుడుతుంది.

అవునట తాతయ్యా! మా మేష్టారుగారంటుంటాడు. మనిషికి వారి వారి వంశంలోని పెద్దవాళ్లని బట్టే మంచి గుణాలు, చెడ్డ గుణాలు వస్తుంటాయట అన్నాడు కేశవుడు.

వారి మాటలు వింటు భూదేవమ్మగారు లోపలినుండి 'ఏమండీ, మీ కథ యింకా అయిపోలేదా! గౌరితో పనిఉంది' అని అన్నది.

అయిపోయిందే! ఇదుగో వస్తున్నారు పిల్లలు, అని మాటలుపసంహరించినాడు పరంధామయ్య.

-:శుభం:-

